MISIMI/ మిసిమి RNI Regd. No.45042/90 Telugu Monthly, Hyderabad-500 020. Postal Regd.No.H/SD-191/2003



ముగ్గురు సోదరీ మణులు ఈ చిత్రంలో ఒక నాజూకు చలనం కనిపిస్తుంది.

వీరు నిజంగా దేవతలంత అందంగా ఉన్నారు.

# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." - Dammapada.**

సంపుటి 14 జులై 2003 సంచిక 7

వ్యవస్థాపక సంపాదకుడు : **డాక్టర్ రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయ సూచిక

మానసిక నైతిక సమస్యగ అవిధేయత — మూలం : ఎరిక్ ఫ్రామ్, అనువాదం : యింటూరి సాంబశివరావు

కార్ల్ గస్టావ్ వెర్నర్ వాన్ హీడెన్‌స్టమ్ — మూలం : స్వెన్ సోడర్మన్, అనువాదం : బి. వి. రామిరెడ్డి

సమసమాజం గురించి – డా॥ సర్దేశాయి తిరుమలరావు

సంగీతంతో సాంస్కృతిక దౌత్యం – డ్యాక్టర్ దేవరాజు మహారాజు

– వింజనంపాటి రాఘవరావు

పెట్టుబడిదారీ వ్యవస్థ 'అంతర్లోకం' రావిశాస్త్రి 'కిరీటిరావు' – జయంతి పాపారావు

కళావాదాలు అన్నీ ప్రగతి శీలమైనవి కావు – విరియాల లక్ష్మీపతి

విడిప్రతి రూ. 8/- వార్షిక చందా రూ. 100/- విదేశీయులకు $ 20

ముఖచిత్రం : **అభిసారిక**

చిత్రకారుడు : **కళాసాగర్**

Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,
1-1-60/5, R.T.C. 'X' Roads, Musheerabad, Hyd - 20. Ph. 7645536
E-mail : misimieditor@rediffmail.com

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# THE NOBEL FAMILIES

| Father | Mother | Daughter | Son-in-law |
|---|---|---|---|
| *Pierre Curie* 1903 Physics | *Madam Curie* 1911 Chemistry | *Irene Joliot Curie* 1935 Chemistry | *Frederic Jollot* 1985 Chemistry |

| Father-in-law | and | Son-in-law |
|---|---|---|
| *Sir Henry Hallet Dale* 1936 Physiology | | *Lord Alexander R Todd* 1957 Chemistry |
| *Heinrich Otto Wieland* 1927 Chemistry | | *Feodor Lynen* 1964 Physiology / Medicine |
| *John Howard Northrop* 1946 Chemistry | | *Frederich Chapman Robins* 1954 Physiology / Medicine |

| Husband | and | Wife |
|---|---|---|
| *Cari F Cori, 1947 Physiology / Medicine* | | *Gerty T. Cory.* |
| *Gunner Myrdal*, 1974 Economic Sciences | | *Alva Myrdal*, 1982 Peace |

| Father | and | Son |
|---|---|---|
| *Sir William Bragg*, Physics | | *Sir Lawrence Bragg*, Physics |
| *Sir Joseph John Thompson*, 1906 Physics | | *Sir George Paget Thomson*, 1937 Physics |
| *Niels Bohr*, 1922 Physics | | *Aage Niels Bohr*, 1975 Physics |
| *H Von Euler Cheplin*, 1929 Chemistry | | *Ulf Von Euler*, 1970 Physiology/Medicine |
| *Kari Manne Siegbahn*, 1924 Physics | | *Kai Siegbahn*, 1981 Physics |

| Uncle | and | Nephew |
|---|---|---|
| *Sir CV Raman*, 1930 Physics | | *S Chandrasekhar*, 1983 Physics |

| Brothers | |
|---|---|
| *Jan Tinbergen*, 1969 Economic Science | *Nikolas Tinbergen*, 1973 Medicine |

| Brothers-in-law | |
|---|---|
| *Charles Hard Townes*, 1964 Physics | *Arthur Schawlow*, 1981 Physics |

# మానసిక నైతిక సమస్యగ అవిధేయత

## (Disobedience as a Psychological and Moral Problem)

మూలం : ఎరిక్ ఫ్రామ్ అనువాదం : యింటూరి సాంబశివరావు

శతాబ్దాలుగా రాజులు, పూజారులు, భూస్వాములు, పారిశ్రామికవేత్తలు, తల్లిదండ్రులు విధేయత సుగుణమని, అవిధేయత దుర్గుణమని ప్రత్యేకించి చెప్పడం జరిగినది. ఈ అభిప్రాయం మరియొక పార్శ్వాన్ని ప్రవేశపెట్టేముందు ఈ స్థితికి వ్యతిరేకంగా ఈ క్రింది వివరణ అవసరం. మానవ చరిత్ర అవిధేయత వల్ల ప్రారంభమయిందని, విధేయతవలన ముగింపు జరుగుతుందని.

యూదు, గ్రీకు పురాణగాధల ప్రకారం మానవచరిత్ర అవిధేయతవలన ప్రారంభమయింది. ఈడెన్ ఉద్యానవనములో, ఆడమ్ ఈవ్‌లు నివసిస్తూ ప్రకృతిలో భాగస్తులు. వారు ప్రకృతితో సన్నిహితంగా సామరస్యంగా ఉన్నారు. అయితే వారు దానిని దాటి పోలేదు. పిండం తల్లి గర్భంలో ఉన్నట్లు వారు ప్రకృతిలో ఉన్నారు. ఒక ఆజ్ఞను విచ్ఛేదం చేయటంవలన వారు అవిధేయత ప్రకటించటం, తల్లి ప్రేమనుండి వేరు పడటం, భూమితల్లి సంబంధం తెగిపోవటం, మానవపూర్వ సామరస్యం నుండి బయట పడి స్వతంత్రం, స్వేచ్ఛలోకి మొట్టమొదటి సారిగా ముందుకు పోగలిగారు. ఆడమ్ ఈవ్‌ల అవిధేయతా క్రియ స్వేచ్ఛా విముక్తులను చేసి వారి కళ్ళను తెరిపించింది. ఒకరి నొకరు గుర్తించారు. వారి అవిధేయతా ప్రవృత్తి ప్రధానబంధం పటాపంచలయ్యేట్లు చేసి వ్యక్తులను చేసింది. జన్మ పాపం అను అవినీతికి సుదూరం చేసి మానవుని స్వేచ్ఛకి సిద్ధపరిచింది. అది చరిత్ర ప్రారంభం. తన సమర్థతల మీద ఆధారపడి నేర్చుకోవడం కోసం, సంపూర్ణ మానవునిగా మారడానికి మానవుడు ఈడెన్ ఉద్యానవనాన్ని వదల వలసి వచ్చింది.

ప్రవక్తలు తమ ఉన్నత భావనతో మనిషి అవిధేయత ప్రకటించటం సక్యతకోసమని రుజువు పరిచారు. ''పాపం'' అనే అవినీతి పరుడు కాకుండా మానవపూర్వ సామరస్య శృంఖలాల నుండి స్వేచ్ఛను పొందాడు. మానవుడు మానవత్వం గల వ్యక్తిగా మారుటకు చరిత్ర ప్రస్థానం అయింది. మానవుడు, తనకు, తనతోటి మనుష్యులకు మరియు ప్రవృత్తికి కొత్త సామరస్యాన్ని సృష్టించేవరకు ప్రేమ, హేతువు అనే శక్తులను తన వ్యక్తీకరణలో అభివృద్ధి చేసుకుంటాడు. ఈ కొత్త సామరస్యము ''అంతిమ దినాలు'' అని వర్ణించబడింది. చరిత్ర అవధిలో మనిషికి - మనిషికి, మనిషికి- ప్రకృతికి మధ్య శాంతి ఉంటుంది. అదే మనిషి సృష్టించుకున్న కొత్త స్వర్గం. అది మనిషి మాత్రమే సృష్టించుకో గలుగుతాడు. ఎందుకంటే పాత స్వర్గం నుండి బలవంతంగా నెట్టి వేయబడతాడు. అది మానవ అ.

యూదుల పురాణ గాధ మాదిరిగానే గ్రీకుల పురాణ గాధ కూడ మానవ అవిధేయత వల్లనే మానవ నాగరికత అంతా తెలుసుకున్నారు. దేవుళ్ళ నుండి నిప్పు దొంగిలించటంతో ప్రామితియస్ మానవ పరిణామానికి పునాది వేశాడు. ప్రామితియస్ ''నేరం'' చేయకపోతే మానవ చరిత్ర వుండేది కాదు. అతను కూడ ఆడమ్ ఈవ్‌ల వలే తన అవిధేయత వలన శిక్షింపబడ్డాడు. అయినా అతను

---

యింటూరి సాంబశివరావు, దామరపల్లి, గుంటూరు జిల్లా స్వతంత్ర ప్రజా సమితి అధ్యక్షులు

పశ్చాత్తాపం పొందటం కాని, క్షమాభిక్ష అడగటం కాని జరుగలేదు. పైగా గర్వంగా ఇలా చెప్పుకున్నాడు. ''దేవుళ్ళకు విధేయత గల బానిసగా బ్రతికేకంటే నన్ను ఈబండకు శృంఖలాబద్ధుని చేయండి.''

అవిధేయతా చర్యలవలన మానవుడు పరిణామం చెందటం కొనసాగుతున్నది. తమ మనస్సాక్షి, నమ్మకాలతో అధికారులకు ధైర్యంగా ఎదురొడ్డి మానసిక సంపదను పెంచుకొనటమే కాకుండా, ఎన్నో రోజుల నుండి స్థిరపడి పోయిన అభిప్రాయాల అధికారానికి అవిధేయత ప్రకటించటంవలన, కొత్త అభిప్రాయాలకు ముక్కుతాడువేసి నొక్కే అధికారాలను మానవుడు వ్యతిరేకించే శక్తి పైన తన మేధో సంపద పెరిగే అవకాశం కూడ వుంది.

అవిధేయత ప్రకటించే శక్తి పై మానవ చరిత్ర ప్రారంభమయితే, విధేయతతో నేను చెప్పినట్లుగా అంతిమ చరిత్ర అవుతుంది. నేను లాంఛనప్రాయంగా, కవితా పరంగా మాట్లాడటం లేదు. మానవ నాగరికతనే కాదు, జీవ ప్రపంచాన్ని సర్వనాశనమయే సాధ్యతకు సంభావ్యతకు ఆధారం వుంది. ఇది హేతుబద్ధము కాదు. అర్థవంతమైనది కాదు. సాంకేతికంగా మనము అణుయుగములో వున్నప్పటికీ అధికారములో వున్న వారితో సహా ఎక్కువమంది మానసికోద్రేకంగా రాతి యుగంలో వున్నాము. మన గణితశాస్త్రం, ఖగోళశాస్త్రం, సమాజ శాస్త్రాలు ఎంతో ముందుంటే - మన రాజకీయాలు, రాజ్యం - సమాజం శాస్త్రం కన్నా ఎంతో వెనుకబడి వున్నాయి. ఒకవేళ మానవ జాతి ఆత్మహత్య చేసుకోవడం జరిగేటట్లయితే, దానికి కారణం ఆటంబాంబులు నొక్కే అధికార పీఠాలకు మానవజాతి తల వంచటమే. భయం, ద్వేషం, దురాశ అను అతి ప్రాచీనమైన వత్తిడులు నిరుపయోగమైన రాజ్య సర్వస్వతంత్ర ప్రతిపత్తి, జాతిగౌరవం అను మురికి గుంటలకు విధేయత ప్రకటించటమే. రష్యా నాయకులు విప్లవాన్ని గురించి మాట్లాడుతారు. మనమూ (అమెరికన్లు) స్వేచ్ఛను గురించి మాట్లాడతాము. రష్యా చాల స్పష్టంగా బలవంతపు పద్ధతుల ద్వారా, స్వేచ్ఛా ప్రపంచములో అస్పష్టంగా ''నచ్చచెప్పటం'' అనే జిత్తులమారి పద్ధతులద్వారా వారూ-మనం విప్లవం, స్వేచ్ఛను గురించి మాట్లాడుతున్నప్పటికీ అవిధేయతను నిరుత్సాహ పరుస్తాము.

అవిధేయత అంతా సుగుణమని, విధేయత అంతా దుర్గుణమని కాదు నా ఉద్దేశం. అలాంటి అభిప్రాయం, అవిధేయత, విధేయతల గతి తార్కిక సంబంధాన్ని అలక్ష్యం చేయటమే. సూత్రాలు సమన్వయ పరచటానికి వీలులేనపుడు ఒక సూత్రానికి విధేయత - ఎదుటి పక్షానికి అవిధేయత అవుతుంది. ఎదుటి పక్షం పూర్వ పక్షానికి విపర్యం అవుతుంది. అంటిగాన్ అతి ప్రాచీనమైన ఈ విభజనకు ఉదాహరణ. అమానుషమైన రాజ్య చట్టాలకు విధేయత వలన అంటిగాన్ మానవత్వ చట్టాలకు అవిధేయత ప్రకటించటమే. పూర్వ పక్షానికి విధేయత ప్రతిపక్షానికి అవిధేయత. మత నమ్మకాలకు, శాస్త్రానికి ప్రాణాలర్పించిన వారంతా అవిధేయత ప్రకటించటంలో మొగ్రాడు వేయబడి జాగ్రత్తలు హెచ్చరించ బడ్డవారే. మానవత్వం, తత్వం - చట్టాలకు, తమకు, అనుకూలత కోసం అమానుషత్వం ప్రకటించాయి. అవిధేయత ప్రకటించకుండా విధేయత ప్రకటించిన మనిషి బానిసే. విధేయత ప్రకటించకుండా అవిధేయత ప్రకటించిన మనిషి తిరుగుబాటుదారుడు (విప్లవ వీరుడు కాదు). కోపము నిస్పృహ, వ్యతిరేకతల చర్యే గాని (ఆదర్శాల) సూత్రాల కోసమో, దృఢ విశ్వాసం కోసమో కాదు.

శబ్దాల గందరగోళం లేకుండా ప్రధానమైన అర్హతను తయారు చేయక తప్పదు. వ్యక్తికి, సంస్థకు లేక అధికారానికో విధేయత అధీనత స్వయంపాలిత విధేయతను వదులుకోవటం, ఇతరుల సంకల్పాన్ని నిర్ణేతను ఒప్పుకోవటం, స్వయాన్ని వదులు కోవటం సూచిస్తుంది. తన హేతువుకు, దృఢవిశ్వాసానికి స్వయం పాలిత విధేయత, అధీనతకాదు. లేక స్వాధీనత. తన దృఢ విశ్వాసము, నిర్ణయము, వాస్తవంగా తనవి అయితే, తనలోని భాగమే. దృఢవిశ్వాసము, నిర్ణయాలను తను సక్రమంగా అనుసరిస్తే తనకు తనే. ఇందువల్ల విధేయత అన్నమాట రూపకార్థములో వాడినా విషయ పాలిత విధేయత అర్థానికి మౌలికమైన తేడాతో వాడబడింది, అనువర్తించబడింది.

అయితే ఈ ప్రత్యేకతకు ఇంకా రెండు అర్హతలు అవసరం. ఒకటి వివేకానికి చెందిన భావన. రెండు అధికారానికి సంబంధించిన భావన.

వివేకం అన్నమాట ఒకదానికొకటి పూర్తి విలక్షణతతో రెండు దృశ్యాలు విశదీకరిస్తూ ఉపయోగించబడింది. ఒకటి అధికారపూర్వక వివేకం. మనము అసంతుష్టపరచడమేమోనని భయపడి సంతుష్టపరచుటకు ఆదుర్దాపడే, అంతర్గీకరించబడిన అధికార గొంతుక అది. ఈ అధికార పూర్వక వివేకాన్ని తమ వివేకానికి విధేయత ప్రకటించటంతో ఎక్కువమంది అనుభవిస్తున్నారు. ఈ వివేకాన్ని ఫ్రాయిడ్ 'సూపర్ ఈగో' అని పిలిచాడు. అంతర్గీకరించబడిన తండ్రి ఆజ్ఞలు, నిషేధాలు, భయం వలన వీటిని అంగీకరించే కుమారులకు Super-ego ప్రాతినిధ్యం వహిస్తుంది. అధికార పూర్వక వివేకానికి పూర్తి తేడాతో రెండవది మానవ వివేకం. ఇది ప్రతి మనిషిలో (స్వతంత్రంగా) బాహ్య అనుమతులు, బహుమతులు లేకుండా స్వతంత్రంగా ఉంటుంది. మానవ వివేకం ఏది మానవతో, ఏది అమానవతో, ఏది నిర్మాణాత్మకమో, ఏది విధ్వంసమో మానవుల సహజ జ్ఞానం అనే యదార్థ విషయంపై ఆధారపడుతుంది. ఈ వివేకం మానవులకు తమ నిర్వహణకు సేవచేస్తుంది. ఈ వివేకపు గొంతు మనల్ని మనలనుగా, మానవజాతిగా ఎలుగెత్తుతుంది.

అధికార పూర్వక వివేకం, అంతర్గీకరించబడిన అధికారము అయినప్పటికీ తనకు అతీతమైన అధికారానికి విధేయతగానున్నది. చైతన్య స్థాయిలో నా వివేకాన్ని అనుసరిస్తున్నానని నమ్ముతాను అయినప్పటికి, ఫలితం మాత్రం, అధికార సూత్రాలను మింగిన నేను మానవత్వ వివేకం, అంతర్గీకరించబడిన వివేకం ఒకటేనని భ్రమపడి, (అంతర్గీకరించబడిన అధికారం) అనుభవం ద్వారా నాలోని భాగం కానట్టి అంతర్గీకరించబడిన అధికారం, స్పష్టంగా తెలిసిన అధికారం కన్నా విజయవంతమగుచున్నది. తనకు తానుగా, తనకు తనే నిర్ణీత శక్తియైన మానవత్వ వివేకాన్ని తనకు అతీతమైన ఆలోచనల అధికారాల విధేయత, అధికారపూరక వివేకం దుర్బలతకు దారి చూపుతుంది.

వివరణ ఏమనగా మరొక వ్యక్తికి విధేయత స్వయంగా అధీనన అయినా అది హేతుబద్ధమైనదా, అహేతు బద్ధమైనదా అనే ప్రత్యేకతను అర్హతగా గుర్తించవలసిన అవసరం వుంది. విద్యార్థి-ఉపాధ్యాయుల సంబంధంలో హేతుబద్ధమైన అధికారాన్ని, బానిస-యజమాని సంబంధంలో అహేతుబద్ధమైన అధికారాన్ని మనము ఉదాహరణలుగా తీసికొనవచ్చు. ఒక వ్యక్తి అధికార ఆజ్ఞలో పై రెండు సంబంధాలు ఆధారపడటం యదార్థ విషయం. గతిపరంగా అవి వేరు వేరు స్వభావములు గలవి. ఉపాధ్యాయుడు,

విద్యార్థి అభిరుచులు, ఆదర్శవంతమైన సందర్భములో ఒకే మార్గమున వుండును. ఉపాధ్యాయుడు విద్యార్థి అభివృద్ధి విజయవంతమయితే సంతోషపడతాడు. అపజయమయితే విద్యార్థి ఉపాధ్యాయుల ఇద్దరి అపజయం. దీనికి వ్యతిరేకంగా యజమాని బానిసను వీలయినంత వరకు దోపిడి చేయటానికి ఉవ్విళ్ళూరుతాడు. అతని నుండి ఎంత ఎక్కువగా లాభం లాగ గలిగితే అంత సంతోషపడతాడు. అదే సమయంలో బానిస తనశక్తి కొలది కనీస సంతోషం కొరకు ప్రయత్నము చేయును. ఇద్దరి అభిరుచులు వేరు. ఒకరికి పురోగమన విషయమైతే ఇంకొకరికి హానికరమైన విషయం. ప్రతి సందర్భములో ఒకని పై మరొకని అధికారం - ఒకటి అధికారాన్ని చెలాయించే వ్యక్తికి దోహదపడే పరిస్థితి. రెండు అధికారం చెలాయించబడే వ్యక్తి దోపిడి. దీనికి సమాంతరంగా ఇంకొక ప్రత్యేకత నడుస్తున్నది. విశ్వవ్యాపితంగా ఉండి ఉపాధ్యాయుడైన నావికాధికారియైన, వారి ఆజ్ఞలు హేతుబద్ధమైన అధికారం. మనము ఏ అధీనతతో సంబంధము లేకుండ అంగీకరించగలము. ఒక సూచనకు కాని ఒత్తిడిని కాని అహేతుక అధికారం ఉపయోగించవలసి వస్తుంది. దోపిడిని నిరోధించే స్వేచ్ఛ వుంటే ఎవడూ తనను దోపిడికి వదులుకోడు.

మనిషికి విధేయుడుగా ఉండటం తేలికై, అవిధేయుడుగా ఉండటం కష్టమయింది, ఎందుచేత? నేను రాజ్యానికి, చర్చికి, పబ్లిక్ అభిప్రాయాల అధికారానికి విధేయతవలన సురక్షితంగా హాయిగా ఉండునని అభిప్రాయ పడతాను. ఏ అధికారానికి నేను విధేయుడనో అనే విషయములో తేడా కొద్దే. ఒక సంస్థ కాని, మనుషులు కాని ఏదో ఒక రూపంలో సర్వజ్ఞులమని సర్వశక్తివంతులమని కపట వేషము వేసి వత్తిడిని వుపయోగిస్తాయి. నా విధేయత నేను ఆరాధించే అధికారంలో భాగమై నేను బలవంతుణ్ణని సంతృప్తి. (నేను) ఆ అధికారము నా కొరకు పనిచేస్తుంది, కనుక నేను తప్పు చేయలేను. నేను ఒంటరిగా ఉండలేను, అది నాకు కాపలా కాస్తుంది, అది నన్ను పాపం చేయనీయదు. ఒకవేళ నేను అవినీతి, పాపం చేసినట్లయితే సర్వాధికారికి తిరిగి వప్పజెప్పే ఒకే ఒక మార్గం వుంది.

అవిధేయత ప్రకటించటంలో తను తప్పు చేయటానికి పాపం చేయటానికి ఒంటరియై ధైర్యాన్ని తప్పక కలిగి వుండాలి. అయితే ధైర్యం ఒకటే చాలదు. ధీశక్తి వ్యక్తి అభివృద్ధిపై ఆధారపడి వుంది. తల్లి ఒడి నుండి తండ్రి ఆజ్ఞల నుండి బయట పడితేనే, సంపూర్ణ మానవుడుగా బయటపడితేనే, తనకు తానుగా ఆలోచించే, భావించే శక్తిని సంపాదించినపుడే, అపుడు మాత్రమే అధికారానికి ''లేదు'' అని అవిధేయత ప్రకటించే ధైర్యం కలిగి వుంటాడు.

అధికారానికి ''లేదు'' అని చెప్పటం నేర్చుకుంటూ అవిధేయతా చర్యల ద్వారా మనిషి స్వేచ్ఛను పొందుతాడు. అయితే అవిధేయత ప్రకటించే శక్తి స్వేచ్ఛకు షరతు మాత్రమే కాదు, స్వేచ్ఛ కూడా అవిధేయతకు షరతే. నేను స్వేచ్ఛ అంటే భయపడితే నేను ''లేదు'' అని ధైర్యం చేసి చెప్పలేను, అవిధేయత ప్రకటించే ధైర్యం కలిగి వుండలేను. స్వేచ్ఛ, అవిధేయతా శక్తి పనిలో ( క్రియ) (Work) విడదీయటానికి వీలుకానివి. అందువలన సాంఘిక, రాజకీయ, మత పంథా ఏదయినా సరే స్వేచ్ఛను ప్రకటిస్తూ అవిధేయతను తొక్కివేస్తే సత్యాన్ని దర్శించలేరు.

అధికారానికి ''లేదు'' అని చెప్పటంలో అవిధేయత ప్రకటించే ధైర్యం ఎందుకంత కష్టమయిందో చూద్దాం. ఎక్కువగా కాల చరిత్రలో విధేయత నీతి అని అవిధేయత అవినీతి అని గుర్తించబడింది.

కారణం చాల తేలిక. కొద్దిమంది ఎక్కువమందిని చరిత్ర ఆ సొంతం ఎక్కువగా పరిపాలించారు. మంచి సంపద కొద్ది మందికి మాత్రమేనని, పనికిరాని బీడు సంపద ఎక్కువ మందికోసం మాత్రమేనని అవసరమైన ఆజ్ఞ రుద్దబడింది. మంచి సంపద కొద్ది మంది అనుభవించాలంటే ఎక్కువమంది వారికి సేవ చేయటం, పని చేయటం అవసరమైన ఒక షరతుగా వున్నది. అది ఎక్కువమంది విధేయత నేర్చుకోటం. కేవలం వత్తిడితో విధేయతను వ్యవస్థీకరించవచ్చును, అందుకు అనుమానం లేదు. ఈ పద్ధతి వలన చాల నష్టాలున్నవి. ఈ పద్ధతి నిత్యం బెదిరింపుకు గురి అవుతూ ఎక్కువమంది కొద్దిమందిని వత్తిడి ద్వారా త్రోసి వేయటానికి సాధనం కావచ్చు. ఇంకా సక్రమంగా చేయించుకోటానికి వీలుకాని ఎన్నో పనులు విధేయత మాటున భయ పెట్టి చేయించుకోవచ్చు. ఈ కారణం వలన వత్తిడి వలన మూలీకరింపబడిన భయం మనిషి హృదయంలోకి గుచ్చబడాలి. అవిధేయతకు భయపడటమే కాదు, అవసరం వుందని కూడ విధేయతను కోరుకోవాలి. సర్వం మంచి, సర్వం తెలివి అనుగుణాలను ఎప్పుడూ తెలుసుకొనేదని అధికారం కల్పించుకోవాలి. ఇలా సంభవించగానే అధికారము అవిధేయత అవినీతియని, విధేయత నీతి అని ప్రకటించుకోగలుగుతుంది. ఒకసారి ప్రకటించుకోగానే ఎక్కువమంది తమంత తామే పిరికిపందలై విధేయత మంచి అని ఒప్పుకోవటం, అవిధేయత చెడు అని తిరస్కరించటం. లూదరు నుండి 19వ శతాబ్దం వరకు నగ్నమైన స్పష్టమైన అధికారాల కోసం ప్రతి ఒక్కరు ఆందోళనపడటమే. లూదరు, పోపు, రాజులు అధికారాన్ని నిలబెట్టటాన్ని కోరుకుంటే, మధ్య తరగతి, కార్మికులు, తాత్వికులు మతాన్ని కూల్చటానికి ప్రయత్నించారు. రాజ్యంలో, కుటుంబంలో అధికారానికి వ్యతిరేక పోరాటంలో ధైర్య సాహసాలు గలిగిన స్వతంత్రమైన వ్యక్తిగా అభివృద్ధి చెందటానికి భూమిక అయింది. 18వ శతాబ్దపు తాత్వికుల వెలుగు, శాస్త్రజ్ఞుల మేధోక్రియా ప్రవృత్తి అధికారానికి వ్యతిరేక పోరాటం విడదీయరానిది. ఈ విమర్శనా క్రియా వృత్తి హేతువులోంచి నమ్మక భాగమే. అదే సమయంలో అధికారము, ఆచారము, సాంప్రదాయము, మూఢ నమ్మకాలపై చెప్పబడిన విషయాలు, ఆలోచనలు, అన్నిటిపై సందేహం వెలిబుచ్చటం. అవిధేయత దృక్పథ లక్షణం. ''అన్నిటినీ సందేహించు'', ''తెలిసికోవటానికి సాహచించు'' అను సూత్రాలపై ''లేదు'' అని అవకాశమిచ్చి ప్రోత్సహించేది.

ఆడల్ఫ్ ఐకమన్ విషయం మన పరిస్థితికి ప్రతీక. అతనిపై జెరూసలెం న్యాయ స్థానంలో నేరం మోపిన వారి ఆందోళనకు సుదూరమైన ప్రాధాన్యత వున్నది. ఐకమన్ తనకు తాను దూరమైన సంస్థాగతమైన మనిషి. అతనికి పురుషులు, స్త్రీలు, పిల్లలు వట్టి అంకెలే. అతను మన అందరి ప్రతినిధి. ఐకమాన్ మనకు అద్దం లాంటివాడు. అతను స్వయంగా ఒప్పుకున్న పరిమితులు, కథ నేను అమాయకుణ్ణని సంపూర్ణ నమ్మకముతో ఉండగలగటం. ఇది చాల భయంకరమైన విషయం. అతను అదే పరిస్థితిలో మరొక సారి వుంటే అదే పని చేయటం చాల స్పష్టమైన విషయం. అలా మనము చేశాము. అలాగే చేస్తాము.

సంస్థాగతమైన మనిషి అవిధేయత ప్రకటించే శక్తి కోల్పోయాడు. తను విధేయత ప్రకటిస్తున్నానన్న స్పృహ కూడ లేదు. ఈ చరిత్ర సంధ్యలో సందేహించటం, విమర్శించటం, అవిధేయత ప్రకటించటం, భవిష్యత్ మానవజాతి, అంతిమ నాగరికతల మధ్య కూడలియై నిలబడుతుంది.

# కార్ల్ గస్టావ్ వెర్నర్ వాన్ హీడెన్‌స్టమ్

## (1916 సంవత్సరపు నోబెల్ సాహితీపురస్కారం)

మూలం : స్వెన్ సోడర్మన్,                                        అనువాదం : బి.వి. రామిరెడ్డి

### ఆత్మకథాత్మక విమర్శనా వ్యాసం

ఈ శతాబ్దపు స్వీడిష్ కవిత్వంలో, అత్యుత్తమ శ్రేణి కవుల వరుసలో వెర్నర్ వాన్ హీడెన్‌స్టమ్ ఒక నక్షత్రంలా మెరుస్తాడు. అతడు 1890 దశకపు కవులయుగానికి నాయకత్వం వహించాడు. అతడు కొత్త స్వీడిష్ తరానికి కొత్త సిద్ధాంతాన్నీ, ఆదర్శాలనీ నిర్దేశించాడు. అతడు తన క్రొత్త కవితల్లో ఊహాత్మకతకు, కవితారూపానికి కొత్త దార్లు వేశాడు. అతని తరువాతి కవితా సంకలనాలలో, స్వచ్ఛమైన గీతరచనాకళలో కళాఖండాలున్నాయి. అతని రచనల్ని తక్కువగా అంచనా వేయడానికి వీలులేదు. మొదట్నించీ జాతీయతా భావనలతో ప్రభావితుడై, జాతీయతా జీవనానికి చెందిన లక్షణాల్ని పట్టుకోగలిగాడు. అతని కావ్యకవిత్వం సీడిష్ ప్రజల భావుకతను, వారి వ్యక్తిత్వలక్షణాలను వివరిస్తుంది. అతని రచనలు స్కాండినేవియన్ సాహిత్యంలో అత్యుత్తమ స్థాయికి చెందినవి. స్వీడిష్ జాతీయ

అ

హీడెన్‌స్టమ్ 1859లో ఒక ప్రాచీన స్వీడిష్ ఉన్నతకుటుంబంలో జన్మించాడు. మొదట పెయింటర్ కావాలనుకున్నాడు. తరువాత కవిత్వానికి అంకితుడయ్యాడు. 1888లో అతడు ప్రచురించిన మొదటి కవితా సంకలనం ''ది వాండర్ ఇయర్స్'' - ఆధునికస్వీడిష్ కవిత్వంలో ప్రాచ్య భావనలను ప్రవేశపెట్టింది. దీనిలో భావుకతకు వ్యతిరేకమైన సహజాత్మకత ప్రవేశపెట్టబడింది. 1880ల నుంచీ స్వీడిష్ సాహిత్యంలో విషాదం చోటుచేసుకుంది. స్వేచ్ఛా మానవులు ఈ క్రొత్త కవిత్వంలో మనకు దర్శన మిస్తారు. సాహిత్య పునరుజ్జీవనం ఈ కవితల్లో కొట్టవచ్చినట్టు కనబడుతుంది.

ఈ ప్రాచ్య కవితలు కవిత్వంలో నూతనాధ్యాయాన్ని ప్రారంభించాయి. 1892లో రచించిన అతని ప్రసిద్ధమైన వచనకవితలలోను, 1895లో రచించిన కవతల్లోను పునాదుల్ని పోగొట్టుకున్న సౌందర్యారాధకుడి విషాదగాథ మనకు దర్శనమిస్తుంది. హీడెన్‌స్టమ్ తన కవిత్వంలో అంతరంగిక జీవితంలోని క్రొత్త భావనలకు వాకిళ్ళు తెరిచాడు. సహజత్వం, విధినిర్వహణ లాంటి మానవ వ్యక్తిత్వంలో వేళ్ళూనుకున్న లక్షణాలను విపులీకరించాడు. ఉన్నత కుటుంబంలో జన్మించినందువల్ల అనుభవించిన అసంతోషకరమైన అనుభావాలు, బాధానుభవపు విలువ, ఆశ, కవిత్వపు మత్తు,

---

బి.వి. రామిరెడ్డి, ఆంగ్లోపన్యాసకులు, సిద్ధార్థా ఆర్ట్స్ & సైన్సు కళాశాల, విజయవాడ.

ఆధ్యాత్మిక ప్రపంచాన్ని పరిత్యాగంతో అందుకోగల శక్తి అతని జీవన తత్త్వపు అనుభవాలుగా రూపొందాయి. గేయ కవితా రచనలో హీడెన్‌స్టమ్‌కు తిరుగులేదు.

అతని దేశభక్తి కవిత్వంలో ఒక క్రొత్త సంవిధానం కనుపిస్తుంది. అతని మొదటి కవితల్లో తన మాతృభూమి మీది ప్రేమ కనిపిస్తుంది. అతని దేశప్రేమ ప్రజల మీద ప్రేమ; తన మాతృదేశపు చారిత్రిక గాథలమీద ప్రేమ. అతడు 1901లో ప్రచురించిన ''సెయింట్ బ్రిడ్జెట్స్ పిలిగ్రిమేజ్''; 1902లో రచించిన '' ఒన్‌పీపుల్''; 1997-98లో రచించిన ''ది ఛర్ల్స్‌మెన్''; ఇతర వచన కవితల్లోను అతని దేశ భక్తి ప్రముఖంగా కనుపిస్తుంది. 1905-7లో రచించిన ''ది ట్రీ ఆఫ్ ఫోకంగ్స్'' అతని ఇతర రచనలు మధ్యయుగానికి చెందిన స్వీడిష్ జాతి నాయకుడి వ్యక్తిత్వాన్ని వివరిస్తాయి. ఈ రచనల్లో అతని చారిత్రక భావన కనిపిస్తుంది. ఈ కావ్య రచనల్లో రచయిత యొక్క మానవతా వాదం కనిపిస్తుంది. ఈ రచనల్లో త్యాగంతో జీవితాన్ని ఉన్నతీకరించుకోవలసిన అవసరాన్ని; స్త్రీ ప్రేమవంటి విషయాలపై వ్యతిరేకత కనుపిస్తుంది. 1900లలో రచించిన ''సెయింట్ జార్జ్ అండ్ ది డ్రాగన్''; 1904 రచించిన ''ది ఫారెస్ట్ విస్పర్స్'' లాంటి వచన కవితా సంకలనాలలో ఈ భావనలు కనిపిస్తాయి.

1888లో ప్రచురించిన కథలు, తన భ్రమణ స్మృతులు, 1889లో రచించిన ''ఎండీమియన్'' నవల; 1908-10లో రచించిన చారిత్రక ఉపన్యాసాలు; 1899లో రచించిన ''థాంట్స్ అండ్ నోట్స్''; 1909లో రచించిన ''డేస్ అండ్ అక్యురెన్సెస్'' అతని ఇతర ప్రముఖ రచనలు.

హీడెన్‌స్టమ్ తాత్వికత 1915లో ప్రచురింపబడ్డ ''న్యూ పోయెమ్స్'' లో వ్యక్తమయింది. ఈ కవితల్లో అతని జ్ఞానపరిపక్వత, మానవత్వం, భావ సౌందర్యం దర్శనమిస్తాయి. ఒంటరితనంలో మనిషి తనను తాను అర్థం చేసుకోగలుగుతాడు. మనుషుల్ని కలిపేది ప్రేమ. అదే ప్రపంచాన్ని నిర్మింప జేస్తుంది; దేవుని ఉన్నతిని పెంచుతుంది.

మనిషీ ! సాయం సంధ్యా చల్లదనపు ఔన్నత్యాల్లో నీవు విజ్ఞుడవౌతావు; విశ్వాన్ని వీక్షింపగలుగుతావు !!

**జీవిత చరిత్ర**

వెర్నర్ వాన్ హీడెన్‌స్టమ్ (1859-1940) యొక్క సాహితీ ప్రస్థానం ''న్యూపోయెమ్స్'' రచనతో ఆగిపోయింది. 1915 తరువాత అతడు రచించిన ఒకే ఒక్క రచన అతని ఆదర్శీకరింపబడిన ఆత్మకథ -''వెన్ ది చెస్ట్‌నట్స్ బ్లూమ్డ్''. ఇది 1941లో ప్రచురింపబడింది. అతని సంపూర్ణ రచనలు 1945లో 23 సంకలనాలుగా ప్రచురింపబడ్డాయి.

# సమసమాజం గురించి

– డా॥ సర్దేశాయి తిరుమలరావు

డా. సర్దేశాయి తిరుమలరావు (28.11.1928 - 10.5.1994) అనగానే ఆయన విమర్శనా గ్రంథం 'కన్యాశుల్కము - నాటక కళ' గుర్తుకు వస్తుంది. అలాగే 'సాహిత్య తత్త్వము - శివభారతదర్శనము' కూడా! ఒక ఆధునిక నాటకాన్ని, మరో ఆధునిక కావ్యాన్ని తనదైనశైలిలో విశ్లేషించారు సర్దేశాయి తిరుమలరావుగారు. 'మాలపల్లి' కూడా అతనికి అభిమాన పాత్రము. గడియారం వెంకట శేషశాస్త్రిగారి శివ భారతాన్ని విశ్లేషిస్తూ రాసిన 'సాహిత్య తత్త్వము - శివభారత దర్శనము' లో సాహిత్యానికీ విజ్ఞానానికీ మధ్య వుండే సంబంధాన్ని గొప్పగా వివరించారు. రెండింటి మధ్య వుండే అఖాతాన్ని పూడ్చవలెనని అంటాడు.

తిరుమల రావు గారి విమర్శలు, ప్రతివిమర్శలు, వ్యాఖ్యలు, ఉత్తరాలు - భారతి, ఆంధ్ర పత్రిక, ది హిందూ, ది ఇలస్ట్రేటేడ్ వీక్లీ ఆఫ్ ఇండియాలలో విరివిగా ప్రచురింపబడేవి. తెలుగులో అయితే 'తి', 'నిశ్శంక తిమ్మణ్ణ' వంటి అనేక కలం పేర్లతో ప్రచురింపబడ్డాయని తిరుమల రావుగారే నాతో అన్నారు. వివాహం చేసుకోకుండా, ఆ జన్మాంతం సాహిత్యం, విజ్ఞానం, పరిశోధన, సంగీతం, పుస్తక పఠనంతో గడిపిన వ్యక్తి. కపటం, లౌక్యం మాత్రమే కాదు ప్రచారం కూడా ఎరుగని గొప్ప వ్యక్తి ఆయన. తెలుగునాట అతని గురించి కొద్ది మందికే తెలుసు. అది కూడా అతని సాహితీ విహసీ గురించే!

అయితే Sd. Tirumala Rao అనే పేరు అంతర్జాతీయంగా తైల సాంకేతిక పరిశోధనారంగంలో పేరెన్నిక పొందిన నామం. ఆర్గానిక్ కెమిస్ట్రీలో బిట్స్ (పిలని) నుంచి ఎమ్మెసి చేసిన తర్వాత కొంతకాలం బోధనా వృత్తిలో వుండి 1954లో అనంతపురంలో వున్న తైల సాంకేతికపరిశోధనా సంస్థ(OTRI)లో చేరి 1989లో ఆ సంస్థ డైరెక్టరుగా పదవీ విరమణ చేశారు. అయినా 1994లో గతించే దాకా పరిశోధనల్లో పాలు పంచుకున్నారు. అతని తొలి పరిశోధనా పత్రం 1958లో ప్రచురింపబడింది. అది ఆ సంస్థకు 15వ పత్రం. 1990లో ప్రొ. జె.జి. కాణే (J.G. Kane) స్మారక ఉపన్యాసం యిస్తూ - తనకు పి.హెచ్.డి. వంటి పరిశోధనా శిక్షణ, పద్ధతుల నైపుణ్యం, రిఫ్రెషర్ కోర్సులు, విదేశీ పర్యటనలు లేకపోవడం వల్ల తను యింకా కలుషితం కానీ, శుద్ధమైన పరిశోధకుడ్నని ప్రకటించుకున్నాడు. దాదాపు 450కి పైగా జాతీయ, అంతర్జాతీయ స్థాయి పరిశోధనా పత్రాలు వెలువరించడం చిన్న విషయం కాదు. తౌడు, మామిడి టెంకలు, వేరుశెనగ విత్తనాలు, మనం తినే నూనెలు, తినని నూనెలు, కర్పూర తైలాలు ... యిలా పలురకాల నూనెలు గురించి ఆయన పరిశోధన సాగింది. పేటెంట్లు, పేరు, విదేశీమారక ద్రవ్యం మన దేశానికి ఆయన పరిశోధనల వల్ల లభించింది.

అనంతపురం, చిత్తూరు జిల్లాలలో చాలా రకాల నూనెగింజలు విరివిగా పండుతాయి. పీఠ భూమి ప్రాంతంలో నూనెగింజలు అనువుగా పండుతాయి. అయితే తగిన రీతిలో నూనెగింజలకు సంబంధించి రైతులకు, పరిశ్రమలకు తోడ్పాటునివ్వాలని ఉమ్మడి రాష్ట్రం సమయంలోనే

ఆలోచన మొదలైంది. 1949 ఆగష్టు 26న OTRI స్థాపించబడింది. శ్రీ కె. ఎస్. మూర్తి తొలి సంచాలకులు. ఇప్పటికీ దేశంలో ఇటువంటి పరిశోధనా సంస్థ మరొకటి లేదు! అయితే ప్రచారం తక్కువ వున్నా, మంచి ఫలితాలు సాధిస్తున్న సంస్థయిది.

దాదాపు నలభై ఏళ్ళలో నాలుగు వందల పరిశోధనా పత్రాలు వెలువరించి - 100 మంది పరిశోధకుల సావాసంతో సర్దేశాయి తిరుమలరావు పరిశోధనలు సాగాయి. ఈ మొత్తం పరిశోధనల గురించి ఒక ధరావాహిక చేయాలని - అనంతపురం గురించి ఒక ధారావాహికి చేయాలని అనంతపురం ఆకాశవాణి యిటీవల ప్రయత్నించి, ప్రసారం చేసింది. అందులో భాగంగా తిరుమల రావుగారి పరిశోధనలను ఒకసారి స్కాన్ చేసినపుడు OTRI రిటైర్డ్ డైరెక్టర్, తిరుమల రావు పరిశోధక సహాధ్యాయి, మిత్రుడు - శ్రీ జి. అజీముద్దీన్‌గారితో చాలా వివరంగా చర్చించాను.

ఆ సమయంలో సర్దేశాయి తిరుమలరావు గారి 'సమ సమాజం మానవాత్మ' అనే పుస్తకం యిచ్చి చదవమన్నారు అజీముద్దీన్‌గారు. తిరుమల రావు గారు పుస్తకాలు ప్రచురించాలని కూడా తాపత్రాయ పడలేదు. ఇది తెలుగు టైపులో వుంది, రోనియోలో తీయబడ్డది. పది, పాతిక కాపీలు తయారు చేసి వుండవచ్చు. 'అంకితం జిజ్ఞాసువుకు' అంటూ వ్రాయబడిన ఈ పుస్తకంలో 'మానవాత్మలో సమ సమాజం' అనే తిరుమల రావు వ్యాసం, 'సమ సమాజంలో మానవాత్మ' అనే ఆస్కార్‌వైల్డ్ ఆంగ్లవ్యాసం - The Soul of Man Under Socialism అనువాదం, అనుబంధం అంటూ ఈ విషయంపై వ్రాసిన పుస్తకాల వివరాలు యివ్వబడ్డాయి.

సాహిత్యం, విజ్ఞానం మీద విశేష అధికారం వున్న ఆలోచనాశీలి, సృజనాశీలి, వైవిధ్యం ఆశించే పరిశోధకుడు అయిన తిరుమలరావు గారు 'సమసమాజం' (సోషలిజం) గురించి ఏమంటారో తెలుసుకోవడానికి యిది సహకరిస్తుంది. మంచి చేయమని కానీ, చెడు చేయవద్దని గానీ మనలను నివారించే 'మనలోనిది' మన ఆత్మ - అని తిరుమలరావు గారంటారు. సోక్రటీసు వాజ్మ్మాలంలో Internal Oracle (అంతరంగ ప్రబోధం) అనేదే ఆత్మ అని కూడా అంటున్నాడు. ఆస్కార్ వైల్డ్ వ్రాసిన 'సమ సమాజంలో మానవాత్మ' అనే దానిలోని Soul పదమే తనకు ప్రేరేపకమని తిరుమలరావు అంటాడు. విస్తృత సాహిత్య, విజ్ఞాన పరిచయంగల వీరు చాలా మంది ఆలోచనలను ప్రస్తావిస్తాను. ''భావాలేమో ప్రాచీన కాలం నుండి నేటి వరకూ ఆలోచనా పరులు చెబుతూ వుండేవే. వాటినే నేనూ చెప్పినాను.'' అని మున్నుడిలో అంటాడు. ఇంకా ''.....అంటే వ్రాసిన రీతిలో స్వంతం'' అని కూడా అంటాడు. ఈ పుస్తకం 1982 మే 24న వెలువడింది.

ఈ పుస్తకాన్ని గాలించి, చదువమని యిచ్చిన - మిత్రులు అజీముద్దీన్‌గార్కి ధన్యవాదాలు చెబుతూ - ఆలోచనా శీలురయిన 'మిసిమి' పాఠకులు కూడా ఈ రెండు వ్యాసాలు చదవాలని ఆశిస్తూ, - 'మిసిమి'లో ప్రచురణకు పంపే సాహసం చేస్తున్నాను.

- నాగసూరి వేణుగోపాల్

# 1. మానవాత్మలో సమసమాజం

అరణ్యపర్వంలో హనుమంతుడు, భీముడు కలుస్తారు. ''అంత పెద్దఘటానివి కదా, ఏమి ఇట్లయిపోయినావు? నీవు సముద్రాన్ని ఎగిరేటప్పటి ఆకారాన్ని చూడవలెనని ఉంది చూపించవూ'' అని భీముడు మారాము చేస్తాడు. దానికి హనుమంతుడు ''కాలం మారింది నాయనా, అప్పటి నా ఆకారాన్ని చూడలేవు. పంచభూతాలే మారుతాయి. మేము చిరంజీవులమైనా కాలం బట్టే నడచుకుంటాం. కాలం దురతి క్రమం సుమా* అంటూ మందలిస్తాడు.

కాలం అనంతం. అయినా, మన అనుకూలం కోసం భూత, వర్తమాన, భవిష్యత్తు అని విభజించుకొన్నాము.

కాలం అనేదే లేదనీ, అది ఆత్మాశ్రయభావమేకానీ వస్త్వాశ్రయ ధర్మం కాదనీ ఒక వాదం. లవణరాజు కలలో 'యోగవాసిష్టం' జీవితకాలమంతా కొద్ది నిమిషాలలో అనుభవంలోకి వస్తుంది. అది ఇంద్రజాలం క్రిందా, మనోభావం క్రిందా జమలోనికి వస్తుంది. ఐన్‌స్టీన్ రిలెటెవిటీ సిద్ధాంతాను సారం కాలం, ఆకాశంలో భాగం (Space - Time continual).

సాంఘిక శాస్త్రజ్ఞులు కాలంను ''సమస్యల ప్రవాహం''**గా పరిగణిస్తారు. కాలగమనాన్ని రెండు వాధాలుగా రూపించుకోవచ్చు. ఒకటి - కాలం బాణంవలె ముందుకు దూసుకొని పోతూ వుంటుంది.

---

*అన్వః కృతయుగే కాలనేత్రాయం ద్వాపరేపరః
అయంప్రధ్వంననః కాలోనాద్వతం రూపమన్తిమే 7

భూమి నద్యోనగాః శైలాః సిద్ధాదైన మహర్షయః
కాలం నమనువర్తంతే తథాభావాయుగేయుగే 8

బలవర్ష్మప్రభావాహి ప్రహీయంత్యుద్భవంతిచ
తదలంబత తద్రూపంద్రష్టుం కురుకులోద్వహ

యుగం నమనువర్తామి కాలోహిదురతిక్రమ 9

యుగాను పర్తనం త్వేతత్ కుర్వంతి చిర జీవినః 38

మహాభారతం - వనపర్వ - అధ్యా 149

**I wish to consider an alternative to this theory, one that represents time as a "flow of problems". This sees the past and the time when the actions were taken to influence further problems, the present as the time when the actions are being taken to influence current and future problems, and the future as the time when anticipated may occur as current problems.

Social Models : blue prints or processes ?
Graham R. Little
Impact of Science on Society 31, 4 (Oct-Dec. 1981) 439 - 447

పునరావృతం అయ్యే రాత్రింబవళ్లు, రుతువులు చూస్తే, కాలం చక్రంవలె దొర్లుతూ తిరుగుతూ పోతూ వుందనడం. రెండు కాలం వెనుకకు పోవడం వుండదు. ఉంటే ముసలి వాడు, పిల్లవాడై, కూనై, పిండమై, శుక్లశోణిలూలై, రక్తమై, అన్నసారమై, అన్నమై, గింజలై పోవలసి ఉంటుంది.'' ఎప్పుట బుట్టెనప్పటెకి నేగుట నైజము ప్రాణకోటికిన్'' అనే భాగవత పద్యంలో ఇట్టి అర్థమిచ్చే పంచాగ్ని విద్య చెప్పబడిందంటారు.* దేహం నుండి వెలువడిన జీవుడు ఆకాశం చేరుకొని, మేఘాల ద్వారా వర్షింపబడి, ఆహారమై, శుక్ల శోణితాలై, పిండమై పుట్టుతాడట. ఇది అనంతవలయంగా సాగిపోతుంది. కాంతి కిరణం కంటే ఎక్కువ వేగంతో ఏదైనా వస్తువు పయనించే పక్షంలో, సూర్యుని నుంచి ఆ వస్తువు ''నేడు'' బయలుదేరి ''నిన్న'' రావచ్చునని పదార్థవైజ్ఞానికులనుచున్నారు.

గతాన్ని మెచ్చుకొనేవారు, వర్తమానాన్ని మెచ్చుకొనేవారు, భవిష్యత్తును మెచ్చుకొనేవారు అని మూడు రకాలవాళ్ళుంటారు. బాల్యకాలాన్ని నెమరు వేసుకొంటూ ఉండేవారు, భూతకాలప్రియులు, వీరి నినాదం ''గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్''. ఇది వ్యాసుడు తన ముసలి తల్లి సత్యవతితో చెప్పిన వాక్యం. నీ మునిమనుమలు కొట్లాడుకొని చస్తారు. దాన్ని మీరు చూడలేరు. వాన ప్రస్థానికి పొండి అని ఆమెకూ, ఆమె కోడండ్రకూ హితం చెబుతాడు.

చిన్ననాటి నేస్తాన్ని గురించి స్కాట్‌లాండ్ కవి రాబర్టు బర్న్సు వ్రాసిన ఈ విశిష్టమైన పద్యం చూడండి.

### బహుకాలదర్శనం*

చిరకాలనేస్తాన్ని మరచి పోవలెనా
మతికి తెచ్చుకోకూడదా?

వంతపాట

ఎన్నాళ్ళకెన్నాళ్ళకు ప్రియతమా
ఎన్నాళ్ళకెన్నాళ్ళకు
బహుకాల దర్శనం.
పాలకాలపు నెనవులకు
దయార్ధ్రం అస్వాదించుదాం మనం
మనిద్దరం కొండ కోనల్లో పరుగెత్తినాం
మంచి బంతి పూలను తెంచినాం
కాళ్లరిగేటట్లు తిరిగినాం
ఎన్నాళ్ళ కెన్నాళ్లకు
బహుకాల దర్శనం
మనిద్దరం వాగుల్లో ఆడినాం
పొద్దుపొడుపునుంచీ అంబటిపూటదాక

### AULD LANG SYNE

Should auld acquintance be forgot
And never brought to min?
Should auld acquintance be forgot
And days O'lang syne ?

CHORUS

For auld lang syne, my dear
For auld lang syne '
We'll tak a cup O'kindness yet
For auld lang syne
We twahae run about the braes
And Pu'd the gowans fine
But we've wandered monie
a weary foot
Sin and lang syne
for auld & C.
We twa hae paidl't I 'the burn

* చూ. ముండక, ఛాందోగ్య ఉపనిషదులు

| | |
|---|---|
| మనమధ్య సంద్రాలు గర్జించినాయి | from mornin sun till dine |
| ఎన్నాళ్లకెన్నాళ్లకు | But seas between us braid hae roard |
| బహుకాలదర్శనం | Sin auld lang syne |
| | For auld & C |
| ఇదుగో నా చేయి అనుంగు సోదరా | And here's a hand, my trust fier |
| ఏదీ నీచేయి ఇయ్యి | And gie's a hand O'thine |
| మంచిపానీయాన్ని తాగుదాం | And we'll tak a right guide Willie - waught |
| ఎన్నాళ్లకెన్నాళ్లకు | For auld lang syne |
| బహుకాలదర్శనం | For auld & C |
| నీవు నీగిండివి కుమ్మి | And surely ye'll be |
| నేను నాదవుతాను | your pint - stowp |
| | And surely I'll be mine |
| మనం సౌహార్దరసాన్ని ఆస్వాదించుదాం | And well tak a cup of kindness yet |
| | For auld lang syne |
| బహుకాలదర్శనం | For auld & C |

బర్న్సు ఒక జానపదగీతం ఆధారంగా స్కాటిష్ ఏసతో వ్రాసినాడు. ఇందులోని అనిర్వచనీయమైన కరుణార్ద్రత చూపించడానికి తెలుగు చేసినాను.

యుద్ధం ముగిసిన తర్వాత లక్ష్మణుడు ''ఈ లంక బంగారంలాగుంది. ఇక్కడే ఉండి పోదా'' మంటాడు. అప్పుడు శ్రీరాముడు బంగారం లాగే ఉందికాని, లక్ష్మణా ఇదినాకు నచ్చలేదు. అమ్మ, పుట్టిన వూరూ స్వర్గంకంటె గొప్ప నాయనా, పద అయోధ్యకు'' అంటాడు.* జనని సరే, జన్మభూమి ఎందుకు? ఇందుకు. పుట్టి, బాల్యం ఎక్కడగడిపి ఉంటారో ఆస్థలం ప్రీతికరం. ''ఉత్తర రామచరితం'' లో శ్రీరాముడిట్లానే అంటాడు. తండ్రిబ్రతికి ఉండగా, తమకు కొత్తగా పెళ్ళయివుండగా, తల్లులు తమగురించే మాట్లాడుకొంటున్న ఆరోజులు పోయినాయి.** కేవలం జన్మస్థలం ముఖ్యంకాదు. ఒకడు విమానంలో పుట్టుతాడు, ఒకడు ఆర్టీసీ బస్సులో పుట్టుతాడు. వారికి విమానం మీదనూ, బస్సు మీదనూ మమకారం ఉండదు. శ్రీ కృష్ణుడు మధురలో, జైలులో పుట్టుతాడు. ఆయనకి మధుర అన్నా, జైలుఅన్నా అంత ఇష్టం వున్నట్లు దాఖలా లేదు. బాల్యాన్ని గడిపినగోకులమంటేనే ఆయనకిష్టం. వసుధైవ కుంటుంబీకుడైననెహ్రూకు ఆయన బాల్యం గడిపిన అలహాబాదు, అచటి త్రివేణీ సంగమం

* అపిస్వర్ణమయీలంకా, నమే లక్ష్మణరోచతే.
జననీ జన్మభూమిశ్చ, స్వర్గాదపిగయసి. రామాయణం

** జీవత్సుతాతపాదేషు, చూతపేదార సంగ్రహే
మాతృభిః చింత్యమానానాం, తేహినోదివనా గతాః ఉత్తరరామచరితం, అం 1. శ్లో 19

అంటే ప్రత్యేకాభిమానం. నాపిడికెడు చితాభస్మాన్ని అలహాబాదు గంగాతీరాన్న కూడా చల్లండి అని తన వీలునామాలో వ్రాసుకొన్నాడు.★

''మాతాచ పార్వతీదేవి, పితాదేవో మహేశ్వర బాంధవాశ్శివ భక్తాశ్చ స్వదేశో భువనత్రయం'' అనే స్థాయిలో వుండే యోగి'' కందిమల్లయపల్లి మావూరు'' అంటాడు. ఇదికీలకం. ''దాని సిగ్గోసిన గోపురం. గోపురమన్నదే కావలసివుంటే మావూరురండి'' అని మల్లంభట్టు అంటే, నారాయణభట్టు ''మీవూరిగోపురం యెవరిక్కావాలిరా! నీకు బోధపడదు. చిన్నతనంలో ఎప్పుడూ ఆగోపురం మీదనే'' అంటాడు.★★ ప్రపంచాన్నంతా పర్యటించి విదేశ స్త్రీని పెండ్లాడి, మాంచి ఉద్యోగం చేసి, రిటయిరయి టంచనుగా ఫించను పుచ్చుకుంటూ హాయిగా జీవించే డాక్టరు దేవ బంధుకు, అతడు అంజిగావుండి చింతల పల్లెలో చెలమనీరు త్రవ్వి త్రాగే పిన్ననాటిరోజులే హఠాత్తుగా కలలో వస్తుంటాయి.★★★ మన అందరిలోనూ ''అంజి'' దాగివుంటాడు. మనం స్మృతిజీవులం.

గురజాడ ''మీపేరేమిటి''కి పోదాము. కథాభాగం: ''మనస్సులు గతకాలము నాటి స్థితిగతులను గూర్చిన ఊహలతో నిండియుండెను. తలపోసి తలపోసి ''ఆనాడు యీ స్థలం ఎలా వుండెనో బౌద్ధులు యేమేం చేసినారో ''అనినేనంటిని''.

ఆసీనుగులూసునలాగేయేడుస్తూవుండేవారు. మనకంటే అర్థానంగా ఉండేవారు'' అని సున్నితమైన తలంపులు బెదరి బెదిరే పెళుసు గొంతుకతో వెంకయ్య అరిచాడు. వాయిదాలావుచేసి తిట్లు తిట్టే మాష్టారు వెంకయ్య.

గతం నశోచాఘి కృతం స్మరామి. గతంలో ఏముంది? ఉండేదే ఇంకమీదట అనేది రెండవ వర్గం. వీరి ప్రకారం. ''గతకాలము కంటె మేలుకాలము వచ్చున్''.★★★★

సర్‌థామస్ మోర్, నేట్షే, బెర్నార్డ్‌షా, అరవిందుడు, టేల్‌హార్డ్ డిచార్డిన్, బ్రొనోస్కీ మున్నగువారు, పురుషుడు పురుషోత్తముడు (superman) కానున్నాడనీ, మానవుడు అత్యున్నత స్థానానికెదుగుతాడనే వీరి తపన, తపస్సు. ★★★★★

---

★ A small handful of the ashes should be thrown into the Ganga ..... I have been attached to the Ganga and Jamuna rivers in Allahabad eversince my childhood and as I have grown older, the attachment has also grown ........... And as witness of this desire of mine and as my last homage to India's cultural inheritance, I am making this request that a handful of my ashes be thrown into the Ganga and Allahabad.

★★ గురజాడ కథ ''పెద్దమసీదు''

★★★ మధురాంతకం రాజారాం కథ ''చెలమనీరు'

నన్నయ పద్యపాదం ఎంత చక్కగా మార్చబడగలదో చూడండి !

డార్విన్ Descent of Man కు పత్యర్థిగా బ్రొనోస్కీ Ascent of Man వ్రాసాడు.

*(ఇంకావుంది)*

# సంగీతంతో సాంస్కృతిక దౌత్యం

- డాక్టర్ దేవరాజు మహారాజు

సంగీతం, కవిత్వం, చిత్రలేఖనం వంటి కళలు వాటికవే ప్రత్యేకమైన భాషలు. వాటికి ప్రాంతీయ దురభిమానం, మతాల పట్టింపులూ, కులాల పట్టింపులూ ఉండవు. స్వార్థ ప్రయోజనాల కోసం, రాజకీయాల్లా దిగజారవు. వాటిని నమ్ముకున్న స్వచ్ఛమైన కళాకారులంతా ప్రపంచ శాంతిని కాంక్షిస్తారు. వసుధైక కుటుంబం వారిది.

ఎం. ఎస్. సుబ్బులక్ష్మి భజనకు ఉత్తర భారతమే కాదు, యూరోప్ దేశాలన్నీ తలలూపాయి. బేగం అఖ్తర్ గజల్‌కు దక్షిణ భారత సంగీత ప్రియులంతా చెవి కోసుకుంటారు. ఆఫ్ఘనిస్థాన్, అరబ్ దేశాలన్నీ కదిలి పోయ్యాయి. ఆఫ్ఘనిస్తాన్ రాజు బేగం అఖ్తర్‌ను ప్రత్యేకంగా ఆహ్వానించి సన్మానించాడు. అలాగే ఎం.ఎల్.వి. అంటే తెలియని సంగీత ప్రియులుండరు. కౌలాలంపూర్, శ్రీలంక, సింగపూర్‌లలో లక్షలాది మంది అభిమానుల్ని తయారు చేసుకున్న ఎం. ఎల్. వసంతకుమారిని నేపాల్ రాజు ప్రత్యేకంగా ఆహ్వానించి సన్మానించాడు. అమెరికా జనరల్ అసెంబ్లీ ముందు ప్రత్యేక ఆహ్వానంపై గానం చేసింది సుబ్బులక్ష్మి. ఇవి ఊరికే ఉదహరించుకోవడానికి కొన్ని అంశాలు. నిజానికి ఈ ముగ్గురు గాయనీ మణుల్లో వున్న సుగుణం ఏమిటంటే, వీరు తమ మాతృభాషలోనే కాక. ఇతర భాషల్లోనూ నేర్చుకుని పాటలు పాడారు. తమ మతాలకు పరిమితం కాకుండా ఇతర మతాల్ని గౌరవించారు. విశ్వవిద్యాలయాలకు, ప్రభుత్వ సంస్థలకు, స్వచ్ఛంద సంస్థలకు, ఆసుపత్రులకు బెనిఫిట్ - షో లిచ్చారు. ప్రభుత్వ రక్షణ శాఖకు ప్రత్యక్షంగా, పరోక్షంగా లక్షల విరాళాలు సమకూర్చారు. జాతీయ సమైక్యత సంగీతంతో సమకూర్చవచ్చని చెప్పడానికి వీరి కృషి పరిశీలిస్తే చాలు. ఎం.ఎల్. వసంత కుమారి తెలుగు, తమిళం, కన్నడం, హిందీ, సంస్కృతం, మళయాళం మొదలైన భాషలలో పాటలు పాడారు. మన రాష్ట్రంలో విశాఖ, కాకినాడ పట్టణాలలో జరిగిన విద్వత్సభలు. అందులో ఎం.ఎల్. వి పాటకచేరీలు తెలుగు వారు గర్వించదగ్గవి. దక్షిణ మీరాబాయిగా పేరు పొందిన అండాల్ కృతుల్ని, పురందర దాసు కృతుల్ని గానం చేయడంలో వసంతకుమారిది ఒక ప్రత్యేకమైనశైలి. ''సంగీతవాణి'', ''అమృతగాన వర్షిణి'', ''తిరుప్పావై మణి'', ''ఇసై సెల్వమ్'', ''సంగీత వనప్రియ'' వంటి బిరుదులు పద్మభూషణ్ వంటి పురస్కారాలు అందుకున్న ఎం.ఎల్.వి. చాలా విషయాలలో ఎం.ఎస్. సుబ్బులక్ష్మి అడుగు జాడల్లో నడిచారు. తన అరవై రెండవ యేట 1990 అక్టోబర్ 31న ప్రకృతిలో గానమై లీనమై పోయారు. ఆమె మరణ వార్తను సంగీత ప్రపంచం భరించలేక పోయింది. అంతకు

డా॥ దేవరాజు మహారాజు, ప్రముఖ కవి, కథారచయిత, నాటకకర్త, పాప్యులర్ సైన్స్ కూడా రాస్తుంటారు. హైదరాబాద్, ఉస్మానియా యూనివర్శిటీలో జువాలజీ - అసోసియేట్ ప్రొఫెసర్‌గా ఉన్నారు.

ముందు రోజే 1990 అక్టోబరు 30న జాతీయ సమైక్యతకు విశేషంగా కృషి చేస్తున్న ఎం.ఎస్. సుబ్బులక్ష్మికి ఇందిరాగాంధీ అవార్డు లభించింది.

కలకత్తాలో పుట్టి లక్నోలో స్థిరపడి అహ్మదాబాద్‌లో అరవయ్యవ యేట కన్ను మూసిన (1974 అక్టోబర్ 30) బేగం అఖ్తర్ రంగస్థల నటిగా, సినిమా నటిగా ప్రసిద్ధురాలు. అంత కంటే గజల్ రాణిగా అందరికీ తెలిసిన గాయని. గజల్‌కు పర్యాయ పదమైన బేగం అఖ్తర్ పేరు భారతీయుల హృదయాల్లో చెరగని ముద్రలు వేసింది. ఎక్కువగా ప్రేమ తత్వాన్ని, ఆరాధనను, విరహాన్ని గానం చేసిన ఈ గాయని గొంతులో గాలిబ్, ఫైజ్ అహ్మద్ ఫైజ్, జిగర్ మొరాదాబాది, జోష్ మలిహాబాది వంటి షాయర్ల గజళ్ళన్నీ కొత్త పుంతలు తొక్కాయి. గీతం, దాద్రా, భజన్, ఠుమ్రీ, గజల్.. అసలేదీ కాక పోయినా సరే ఆమె పాడుతూ ఉంటే చాలు - అనుకునే శ్రోతలు ప్రపంచ మంతటా వుండేవారు.

''ఏ మొహోబ్బత్ తెరె అంజామ్ పె రోనా ఆయా
జానె క్యా ఆజ్, తెరె నామ్ పెరోనా ఆయా'' విన్నప్పుడు గానీ

''ఉల్టీ హోగయి సబ్ తస్ వీరే
కుచ్‌న దవానె కామ్ కియా'' విన్నప్పుడు గానీ

''సంయోకె బర్సాత్‌నె బర్సేగి షరాబ్
ఆయా బర్సాత్ తొ బర్సాత్‌నె దిల్ తోడ్ దియా'' విన్నప్పుడు గాని

ఒక అనిర్వచనీయమైన ఉద్వేగం శ్రోతల్ని కలవరపెడుతుంది. శ్రోతను తన పాటవెంట, పాటలోని పదాల వెంట, పదాల అర్థాల వెంట పరిగెత్తించే బలమైన శైలి ఆమెది. స్వీయ శైలీ విన్యాసం గల గొప్ప కళాకారిణి బేగం అఖ్తర్.

ఇక ఎం. ఎస్. సుబ్బులక్ష్మి విషయానికి వస్తే. ఎంత రాసినా తక్కువే. ఎనభై ఏడేళ్ళ వయసులో కూడా ఆమె సంగీత ప్రపంచాన్ని మహారాణిలా ఏలుకో గలుగుతోంది. తన సంగీతంతో జాతీయ సమైక్యత సాధిస్తున్న ఒక గొప్ప శక్తి ఆమె!! స్వాతంత్ర్య సమరంలో ఈ దేశానికి మహాత్ముడు స్ఫూర్తి నిస్తే, ఆమె తన గానంతో మహాత్ముడికే స్ఫూర్తి నివ్వగలిగారు. ఆయన కోరిన భజనలన్నీ సాధన చేసి వినిపిస్తూ ఉండేవారు. ఆమె తన విజయాలన్నీ సంగీతం ద్వారానే సాధించారు. ఇతర దేశాలతో సాంస్కృతిక దౌత్యం నెరపారు. సాంఘిక కార్య కర్తగా కోట్ల విరాళాలు ప్రకటించారు. మనసుల మధ్య, మనుషుల మధ్య సుహృద్భావాన్ని పెంపొందించేది కళా కారులేనని చెప్పడానికి ఎం.ఎస్. సుబ్బులక్ష్మి జీవితం ఒక మంచి ఉదాహరణ. రాజకీయ నాయకుల నోట 'సెక్యులరిజమ్' అనే మాట హాస్యాస్పదంగా వినిపిస్తున్న ఈ తరుణంలో కళలు తమ భాషను పూర్తిగా వాడుకోవాల్సిన అవసరం ఉందని ఇలాంటి సంగీత కారుల జీవితాలు చెప్పకనే చెబుతాయి. అలాంటి కళా సేవే నిజమైన సామాజిక సేవ!

# దృష్టి

– వింజనంపాటి రాఘవరావు

ఇదిగో చూడండి - మిమ్మల్నే - ఇలా చూడండి - ప్లీజ్ లుక్ హియర్. ఆప్ ఇధర్ దేఖియే.

ప్రపంచంలోని అన్ని భాషలలోనూ ఇతరుల దృష్టిని ఆకర్షించటానికి ఇదే పద ప్రయోగం వాడుతున్నాం. భాష మారినా భావం మాత్రం అదే.

'సర్వేంద్రియాణాం నయనం ప్రధానం' అని సంస్కృతంలోనూ

'కన్నులేక పోతే కలియుగమే లేదు' అని తెలుగు లోనూ నిత్యం మనం కంటి ప్రాధాన్యతను గురించి గుర్తు చేసుకుంటూనే ఉన్నాం.

నేత్ర దానం చేయండి - రెండు జీవితకాలాలు జీవించండి. అంటూ ప్రభుత్వం ప్రచారం చేస్తున్నది. అన్ని దానాల కంటే నేత్ర దానం గొప్పది అనేది ఆధునిక నీతి సూత్రం.

పూర్వ కాలంలో పెద్ద తప్పులకు శిక్ష కళ్ళు పీకేయడమే. మేక కన్నులు తెప్పించి అప్పాజీ రాయలు ప్రాణాలు కాపాడితే, తన కన్న కొడుకును హత్య చేశాడనే అభియోగంపై రాయలు అప్పాజీ కళ్ళు తీయిస్తాడు.

రాజులకు 'చార చక్షువులు' అంటే గూఢచారుల ద్వారా చూస్తారు అనే పేరు ఉండనే ఉంది.

పై విషయాలన్నీ కన్ను ప్రాధాన్యతను గూర్చి చెప్పకనే చెప్తున్నాయి.

ప్రాణులన్నింటికీ కళ్ళుంటాయా? ఈ కన్ను అనే అవయవాన్ని కలిగిన మొదటి ప్రాణి ఏది? గుడ్లగూబలు రాత్రి వేళల్లో మాత్రమే ఎలా చూడగలుగుతున్నాయి? కొన్ని జంతువుల కళ్ళు రాత్రి వేళల్లో ఎందుకు మెరుస్తాయి? వాన పాముకి కళ్ళెన్ని? మనం ఎలా చూస్తాం? వంటి ప్రశ్నలు కొన్నింటికి సమాధానాన్ని జ్ఞాన చక్షువులతో అన్వేషిద్దాం.

అతి ప్రాథమిక జీవులైన ఏక కణ జీవులలో నేత్రాలుండవు. కాని అవి వెలుగు నీడలను గుర్తించ గలవు. వెలుతురు పడినపుడు జీవ కణంలోని ప్రోటో ప్లాసమ్‌లో కొన్ని చర్యలు వేగంగా జరుగుతాయి. దీనిని బట్టి జీవించి ఉన్న ఏ శరీర కణమైనా వెలుతురును గుర్తించగలదు అని తెలుస్తోంది.

నీరు నిల్వ ఉండే కుంటలలో పై భాగాన ఆకుపచ్చని తెట్టు ఏర్పడటం మనం చూస్తూనే ఉంటాం. ఈ తెట్టు యూగ్లీనా అనే అకణ జీవి వలన ఏర్పడుతుంది. ఇది ఆహారాన్ని స్వయంగా తయారు చేసుకుంటంది. ఈ యూగ్లీనా వెలుతురు వైపు ప్రయాణిస్తుంది. ఈ వెలుతురు కనుగొనటానికి ఈ జీవి శరీరం ముందు భాగంలో క్రొవ్వు వంటి పదార్థంతో నిర్మితమైన చుక్క ఉంటుంది. ఇది ఎరుపు రంగులో ఉంటుంది. ఈ క్రొవ్వు పదార్ధం మధ్యలో పారదర్శకమైన, పిండి పదార్థంతో నిర్మితమైన స్ఫటికం ఉంటుంది.

---

వింజనంపాటి రాఘవ రావు, జంతుశాస్త్రోపన్యాసకుడు, ఆంధ్ర ప్రదేశ్ గురుకుల జూనియర్ కళాశాల, హిందూపురం - 515 202.

ఈ స్ఫటికం కటకం లాగా పని చేసి వెలుతురును కేంద్రీకరింప చేస్తుంది. బహుశః ఇదే మొట్టమొదటి కన్ను. దీన్ని (Eye Spot) కంటి చుక్క అంటారు.

మనకు బాగా పరిచయం ఉన్న కళ్ళు లేని జీవి వానపాము. ఈ వానపాములో వెలుతురు గ్రహించ గల ప్రత్యేకమైన కణాలు శరీరమంతటా వ్యాపించి ఉంటాయి. ఈ కణాలలో వెలుతురు కేంద్రీకరింప చేసే కటకం వంటి నిర్మాణం కూడా ఉంటుంది. ఈ కణాలు తలవైపు ఎక్కువగా ఉంటాయి. వానపాము బొరియలలో జీవిస్తుంది. అందుచేత వెలుతురు చీకటిల భేదాన్ని గుర్తించ గలిగితే చాలు.

ఒకే కణం ఉన్న జీవుల నుండి వానపాముల వరకూ చాలా భాగం స్థానబద్ధ జీవులు. అంటే ఒక ప్రదేశానికి అంటి పెట్టుకొని ఉండేవి. లేదా పరాన్న జీవులు. అంటే ఇతర జీవుల శరీరాన్ని అంటి పెట్టుకొని ఆహారాన్ని గ్రహించేవి. మిగిలినవి చాలా నెమ్మదిగా చలించేవి. వీటన్నింటిలోనూ వెలుగు - నీడల తేడా తెలిస్తే చాలు. ఆహారం సంపాదించటానికి ప్రధానంగా ఇవి స్పర్శపైనా, ఇతర జీవులు వదిలే రసాయన పదార్థాలపైన ఆధారపడతాయి.

జీవుల కదలికలో వేగం పెరిగే కొద్దీ వాటిలో దృష్టి ఆవశ్యకత పెరిగింది. రాత్రి వేళ సంచరించే జీవులలోనూ, సముద్రపు లోతుల్లో, చీకటి గుహల్లో నివసించే జీవులలోనూ దృష్టికి అంతగా ప్రాధాన్యత లేదు. వాటిల్లో కళ్ళు క్షీణించటం గాని, లేదా పూర్తిగా నశించి ఉంటాయి. పగలు సంచరించే జీవులు కాంతిని ఆధారం చేసుకొని కదలటానికి, ఆహారాన్ని సంపాదించుకోవటానికి నేత్రాలను బాగా అభివృద్ధి చేసుకొన్నాయి.

| | | |
|---|---|---|
| రెండు కళ్ళుంటే | - | మనిషి |
| మూడు కళ్ళుంటే | - | త్రినేత్రుడు - ఈశ్వరుడు |
| వెయ్యి కళ్ళుంటే | - | సహస్రాక్షుడు - దేవేంద్రుడు* |
| నాలుగు వేల కళ్ళుంటే | - | ఈగ - దోమ - చీమ. |

ఒక కన్ను నుండి వేల కళ్ళ వరకు రకరకాలైన సంఖ్యలలో కళ్ళుండే జీవులున్నాయి ప్రాణి ప్రపంచంలో. ఇంతకీ కంటితో ఎలా చూస్తాం? దృశ్యం మనం చూడాలంటే ఎలాంటి పరిస్థితులు కావాలి. స్థూలంగా చూ్దాం....

కంట్లో ప్రధానంగా శుక్ల పటలం - అనే కంటి గ్రుడ్డును కప్పి ఉంచే భాగం ఉంటుంది. దీని ముందు భాగం పారదర్శకంగా ఉంటుంది. దీనికి లోపల కంటి పాప అనే వర్తులంగా ఉండే భాగం

*ఇన్ద్రస్యహి మన్త్రి పరిష ద్ధృషీణాం సహస్రమ్
సతచ్చక్షుః తస్మాదియం ద్వ్యక్షం సహస్రాక్షమాహుః
ఇంద్రుడి మంత్రి పరిషత్తులో వెయ్యిమంది ఋషులు ఉండే వారట. వాళ్ళే ఆయనకు నేత్రాలు. అందుచేత అతడు అసలు రెండు నేత్రాల వాడే అయినా సహస్రాక్షుడనే పేరు వచ్చింది.
కౌటిలీయమ్ అర్థ శాస్త్రమ్ - ఆంధ్ర వ్యాఖ్య బాలా నందిని - ఆచార్య పుల్లెల శ్రీరామ చంద్రుడు.

ఉండి మధ్యలో తారక అనే కంటిలోకి కాంతిని వెళ్ళ నిచ్చే భాగము, కటకము అనే కాంతిని కేంద్రీకరించే భాగము; చివరగా రెటీనా అనే దృశ్యాన్ని గ్రహించే భాగము ఉంటాయి. నేత్ర నాడి రెటీనాను మెదడును కలుపుతుంది.

కాంతి వస్తువుపై పడి పరావర్తనం చెంది కంటిలోనికి ప్రవేశిస్తుంది. రెటీనా పై దృశ్యపు ప్రతి బింబం ఏర్పడుతుంది. ఏర్పడ్డ ప్రతి బింబం నేత్రనాడి ద్వారా మెదడుకు చేరుతుంది. మనకు దృశ్యానికి సంబంధించిన జ్ఞానం కలుగుతుంది.

క్లాసులో పాఠం జరుగుతుంటుంది. గడ్డం కింద చెయ్యి, దృష్టి బోర్డుపై. మనస్సు మరెక్కడో జరిగిన విషయాల దృశ్యాన్ని మెదడులో ఆవిష్కరిస్తుంది. మనిషి ఇక్కడ మనస్సు మరెక్కడో.

మనందరకూ అనుభవంలో ఉన్న విషయమే ఇది.

అంటే కొన్ని సందర్భాలలో రెటీనాపై ప్రతిబింబం ఏర్పడ్డా దృష్టికి సంబంధించిన మెదడు భాగం పని చేయకపోతే మనకు ఆ దృశ్యం కనపడదు.

'కళ్ళు తెఱచుకుని నిద్రించే జీవి ఏది?' అన్న యక్ష ప్రశ్నకు సమాధానం ఇప్పుడు సరిగా అర్థమైంది కదూ!

అలాగే మనం ఏదైనా ఒక విషయాన్ని గురించి విన్నా, ఎవరైనా ఒక సంఘటనను వర్ణిస్తున్నా, వెంటనే మన మెదడు ఆ సంభాషణను ఒక చిత్రంగా ఆవిష్కరిస్తుంది. మెదడులో నిక్షిప్తమై ఉన్న సమాచారం ఆధారంగా ఈ చిత్రం నిర్మితమౌతుంది. మంచి వక్త అద్భుతమైన చిత్రాన్ని ఆవిష్కరిస్తాడు. మనం కళ్ళు మూసుకున్నా ఆ దృశ్యం కన్పిస్తుంది. అలాగే రేడియోలో ఓ నాటకం వస్తుందనుకోండి, నేపథ్య సంగీతం, నటకుల గాత్ర స్థాయిని బట్టి మనస్సు ఒక విశాలమైన దృశ్యాన్ని ఆవిష్కరిస్తుంది. అదే తెరపై కన్పించే దృశ్యం అయితే పరిమితం - అంటే తెరమీద కన్పించేంత మాత్రమే నన్నమాట.

అలాగే కలలూనూ. కలలను మనం కంటితో చూడం - మనస్సుతో చూస్తాం. ఇలాంటి ఊహా ప్రపంచం జంతువులలో ఉందో, లేదో మనకు తెలీదు. కాని వివిధ రకాల జంతువులలో దృష్టి ఎలా ఉంటుందో మన దృష్టితో చూద్దాం.

ఏ జీవికైనా ఎదుటి వస్తువు ఎలా కన్పిస్తుందో దాని ప్రవర్తనను బట్టి మాత్రమే విశ్లేషించగలం.

అందుకే మన వాళ్ళంటారు 'నా కళ్ళెట్టుకు చూడు అని'

చీమ, దోమ, ఈగ వంటి కీటకాలలో తలపై ఒక జత సంయుక్త నేత్రాలుంటాయి. సంయుక్త నేత్రమంటే ఎన్నో చిన్న చిన్న నేత్రాల కలయిక. ప్రతి కన్ను ఎదురుగా ఉన్న వస్తువు యొక్క కొంత భాగాన్ని ప్రతిబింబంగా ఏర్పరుస్తుంది. అన్ని కళ్ళు ఏర్పరచిన ప్రతి బింబాలన్నీ కలిస్తేనే వస్తువు పూర్తి ఆకారం కనిపిస్తుంది. తేలికగా చెప్పాలంటే T.V. తెరపై కోట్లాది చుక్కలన్నీ కలిసి బొమ్మను ఏర్పరచినట్లుగా అన్నమాట. ఇలాంటి దృష్టినే స్తంభరాధాన దృష్టి అంటారు. ఈ ప్రతి బింబం పగలు స్పష్టంగా ఏర్పడుతుంది. దీనిని ఎపోజిషన్ ఇమేజ్ అంటారు.

రాత్రివేళ ఈ ప్రతి బింబాలన్నీ ఒక దానిపై ఒకటి పడటం వలన ప్రతి బింబం స్పష్టంగా ఉండదు. దీన్ని 'సూపర్ పొజిషన్ ఇమేజ్' అంటారు.

రొయ్యలలో, నత్తలలో కళ్ళు చిన్న చిన్న కాడలపై ఉంటాయి. నత్తలలో ఈ కాడను కత్తిరించినా మరలా కన్ను మొలుచుకు వస్తుంది. సాలీడులో నాలుగు జతల కళ్ళుంటాయి. నాప్లియస్ అనే జీవిలో ఒకే కన్నుంటే, స్పినోడాన్ అనే తొండలో మూడు కళ్ళుంటాయి.

సాలీడులో ఉండే ఎనిమిది కళ్ళలో వెనక వైపు ఉండే రెండు జతలు శత్రువుల బారి నుండి తప్పుకోవటం కోసం. ముందు రెండు జతలు ఆహారాన్ని అన్వేషిస్తుంటాయి. సాలీడులో ఉండే కళ్ళు అన్నింటినీ కలిపితే దాని మెదడు కంటే పెద్దవిగా ఉంటాయి.

ఒక చిన్న ప్రయోగం చేసి చూడండి. ఒక కన్ను మూసి రెండవ కన్నుతో చూడండి. ఎంత వరకు చూడగలుగుతున్నారో గుర్తుంచుకోండి. ఒక కన్నుతో చూడగలిగినంత దృశ్యం ఆ కన్ను యొక్క దృక్పరిధి 'ఫీల్డ్ ఆఫ్ విజన్' అన్నమాట.

ఇప్పుడు రెండవ కన్నుతో అలాగే చూడండి. మొదటి కన్నుతో చూసిన దృశ్యంలో కొంత భాగం ఈ కంటితో కూడ చూడగలుగుతున్నారు కదూ! రెండు కళ్ళతోనూ ఎంత మేర దృశ్యం చూడగలుగుతున్నారో ఆ భాగంలో మాత్రమే మనకు వస్తువు దూరం స్పష్టంగా తెలుస్తుంది. అంటే ఒక్కో కన్నుతో మనం రెండు కొలతలు, పొడవు మరియు వెడల్పు మాత్రమే చూడగలుగుతాం.

రెండు కళ్ళతో చూసినపుడు మాత్రమే మూడవ కొలత కన్పిస్తుంది. మూడు కొలతల దృశ్యం Three Dimentional Image చూడాలంటే రెండు కళ్ళూ పని చేయటం తప్పని సరి అన్నమాట.

ఒక్కో జంతువులో కళ్ల సంఖ్య ఎంతో ఇంతకు ముందు తెలుసుకున్నాం. అయితే ఈ కళ్ళు ఎక్కడ ఉండాలి. పొగరుమోతును 'కళ్ళు నెత్తిమీది కొచ్చాయి' అంటూ విమర్శిస్తాం. సాలీడు వంటి వాటిలో కళ్ళు తలపైనే ఉంటాయి.

కళ్ళు ఎక్కడ అమర్చాలి అన్న విషయంలో ప్రకృతి జీవి అవసరాలకు తగ్గట్లుగా అమర్చింది. కొన్ని జంతువులకు దృక్పరిధి (Field of Vision) ఎక్కువగా ఉండాలి. మరి కొన్నింటిలో వస్తువు ఎంత దూరంలో ఉందో తెలుసుకోవలసిన అవసరం ఉంది.

అడవుల్లో నివసించే జింక, కుందేళ్ళు వంటి జీవులకు నిరంతర ప్రాణ భయం గడ్డి మేసేటప్పుడు నిముషానికి నాలుగు సార్లు తలపైకెత్తి చూస్తుంది. ఇలాంటి ఇబ్బంది కలుగ కుండా శాకాహారులన్నింటికీ ప్రకృతి కళ్ళు తలకు ప్రక్కగా ఉండేట్లు అమర్చింది. దీని వలన ఒక్కో కంటితో ముందు వైపు, ప్రక్క వైపులకే కాక వెనుక వైపుకు కూడా చూడగలుగుతుంది. అలాగే పక్షులలోనూ.

మనం వెనుక వైపు ఏం జరుగుతుందో చూడాలంటే తల వెనుకకు త్రిప్పి చూడాలి. అదే ఆవు వంటి జంతువులు తలను కొద్దిగా మాత్రమే ప్రక్కకు త్రిప్పి చూస్తాయి. అదే వుడ్ కాక్ (Wood Cock) అనే పక్షి తల త్రిప్పకుండానే వెనుక వైపు కూడా చూడగలుగుతుంది. అంతే కాదు తల వెనుక వైపు కూడా ఇది మూడు కొలతల ప్రతి బింబాన్ని చూడగలుగుతుంది. దీన్ని వెనుక వైపు నుండి కూడా పట్టుకోవడం అసాధ్యం.

వేటాడే జంతువులు, పక్షులు మొదలైన వాటిల్లో కళ్ళు సాధ్యమైనంత ముందువైపునకు అమర్చబడి ఉంటాయి. గుడ్లగూబలో కళ్ళు పూర్తిగా ముందు వైపునకు ఉంటాయి.

ఆకాశంలో ఎగురుతూ నేల మీది జంతువును వేటాడే గ్రద్ద అంత ఎత్తు నుండి కోడి పిల్లను ఎలా గుర్తిస్తుంది?

శాస్త్రజ్ఞులను వేధిస్తున్న ప్రశ్న ఇది. ఈ మధ్యనే గ్రద్ద దృష్టికి సంబంధించిన ఓ విషయం కనుగొన్నారు. గ్రద్ద కంటిలో ఉండే కటకం ఒకే సారి రెండు విధాలుగా పని చేస్తుందట. కటకంలో ఒక భాగం విశాలమైన ప్రదేశం ప్రతిబింబాన్ని ఏర్పరుస్తుంది. కటకం మధ్య భాగం మాత్రం టెలిస్కోపులాగా పని చేస్తూ ఒకటిన్నర కిలోమీటర్ల క్రింద ఉన్న కోడి పిల్ల ప్రతి బింబాన్ని స్పష్టంగా ఏర్పరుస్తుంది. అంటే గ్రద్ద కన్ను ఒక భూతద్దం, ఒక టెలిస్కోపు కలిపి తయారు చేసిన నిర్మాణమన్నమాట.

కటకానికి తెరకు మధ్య ఉండే దూరాన్ని సర్దటం ద్వారా తెరపై స్పష్టమైన ప్రతిబింబాన్ని చూస్తాం. కాని మనకంటిలో రెటీనా కటకాల మధ్య ఉండే దూరం స్థిరంగా ఉంటుంది. దూరపు వస్తువు లేదా దగ్గరి వస్తువుల ప్రతిబింబాలు స్పష్టంగా ఏర్పడటానికి కటకం యొక్క వక్ర తలం లేదా 'కర్వేచర్' (Curvature)ను కండరాలు మారుస్తాయి. ఈ కండరాలు కటకాన్ని సర్దే శక్తి కోల్పోయినపుడు మనం దగ్గరి వస్తువులు చూసే శక్తి కోల్పోతాం.

ఇంత వరకూ భౌతిక శాస్త్రం ప్రకృతి తయారు చేసిన కటకాన్ని పోలిన దాన్ని తయారు చేయలేక పోయింది. ఈనాడు మనం ఉపయోగించే అతి సున్నితమైన కటకాలు కంటితో పోలిస్తే అతి ప్రాథమికమైనవన్న మాట. తెరపై కనపడే బొమ్మ మరింత స్పష్టంగా ఉండాలంటే మరింత సున్నితమైన కటకాలను రూపొందించుకోవాలి.

అకశేరుకాలు అంటే వెన్నెముక లేని ప్రాణులన్నింటిలోనూ ప్రతిబింబం రెటీనాపై నిలువుగా పడుతుంది. కాని మనలో ప్రతి బింబం తలక్రిందులుగా పడుతుంది. మరి ప్రపంచం మనకు తల క్రిందులుగా కనపడటం లేదు కదా! దీనికి కారణం మన మెదడు చేసే తమాషా. మన చిన్నతనం నుండి మన మెదడు ప్రతి బింబాన్ని సరిచేసి ప్రపంచం మామూలుగా కనపడేట్లు చేస్తుంది.

ఒకవేళ మన రెటీనాపై ప్రతిబింబం మామూలుగా ఏర్పడితే ఎలా ఉంటుంది? దీనిపై శాస్త్రజ్ఞులు ఓ ప్రయోగం చేశారు. రెటీనాపై ప్రతిబింబం నిలువుగా ఏర్పడేలా కళ్ళజోడు తయారు చేశారు. ఆ కళ్ళజోడు ధరించిన వ్యక్తికి నాలుగైదు రోజులు తల క్రిందులుగా కన్పించినా మెదడు దాన్ని సరి చేస్తుంది. ఈ అద్దాలు తీసివేయగానే మరలా ప్రపంచం తల క్రిందౌతుంది. మెదడు మరలా దాన్ని సరిచేస్తుంది. ఇదంతా ఎలా జరుగుతుంది అన్న విషయం ఇంకా అవగాహన కాలేదు.

మనం చూసే సినిమా నిజానికి కదలని బొమ్మలతో తయారైనదే. కాని సెకనుకు 24 కంటే ఎక్కువ స్థిర చిత్రాలు కదిలితే మనకు అవి కదులుతున్న అనుభూతి కలుగుతుంది. అంటే అది దృక్భ్రమ అన్నమాట.

ఇదే దృక్‌భ్రమ ఒక బొద్దింకకో, ఈగకో కలగాలంటే సెకనుకు 200 స్థిర చిత్రాలు కదలాలి.

ఆక్టోపస్, కొన్ని పీతలు చాలా కీటకాలు రంగులను చక్కగా గుర్తించగలుగుతాయి. అంతే కాక ఈ కీటకాలు అల్ట్రావయొలెట్ కిరణాలను గుర్తించగలవు. కాబట్టి ఇవి మనకంటే ఎంతో స్పష్టమైన అద్భుతమైన దృశ్యాలను చూడగలుగుతాయి.

కోతులు, మానవుడు మినహా మిగిలిన వెన్నెముక గల జీవులన్నింటికీ ప్రపంచం ఒక బ్లాక్ అండ్ వైట్ సినిమా. ఎర్ర రంగు దుస్తులు పశువులను రెచ్చగొడతాయనటం కేవలం కల్పన. ఎందుకంటే పశువులు రంగులను గుర్తించలేవు. రెచ్చిపోయిన పశువు ఏ రంగు బట్టలు వేసుకున్నా వెంటబడి తరుముతుంది.

మీరు ఎప్పుడైనా నదిలోనో, చెరువులోనో మునిగి కళ్ళు తెరచి చూశారా? ఎలా కన్పిస్తుంది? ఓ వైపు సూర్యకాంతి, మరో వైపు బూడిద రంగు ఎడారి. ఎప్పుడూ నీటిలో ఉండే చేపలకు ఆ ప్రాంతం మొత్తం పరిచయం. క్రొత్తగా ఏదైనా వస్తువు కనబడితే వెంటనే అది ఏమిటో తెలుసుకొనే ప్రయత్నం చేస్తాయి. చేపలు ఉన్న చెరువులో నిలకడగా నిల్చున్న వారికి చేపలు ఒంటికి రాసుకుంటూ పోవటం అనుభవంలోకి వచ్చే ఉంటుంది. చేపల ప్రవర్తనను అధ్యయనం చేసిన శాస్త్రవేత్తలు అసలు 'ఎర' లేకుండానే చేపలు పట్టవచ్చు అంటున్నారు. గాలాన్ని నీటిలోకి విసిరినపుడు అది క్రొత్త వస్తువు కాబట్టి దాన్ని తెలుసుకొనే ప్రయత్నంలో గాలానికి చిక్కుతాయి. చేపల వేట అలవాటు ఉన్న వారు ఈ సారి ప్రయత్నించండి. ఎర లేకుండా చేప దక్కుతుందేమో.

మొదటి సారిగా నీటిని వదలి నేల మీదకు వచ్చిన జీవులు ఉభయచరాలు. మనకు తెలిసిన ఉభయచరం కప్ప. ఈ కప్పలకు నేల మీది వాతావరణం క్రొత్త. కప్పలో ఘ్రాణావయవాలు అంతగా అభివృద్ధి చెందలేదు. అందుచేత అది ప్రధానంగా దృష్టి పై ఆధారపడుతుంది. చాలా చేపల వలె కప్పలు కూడా కనుగ్రుడ్డు కదిలించలేవు. ఫలితంగా ఎదురుగా ఉన్న కదలని వస్తువును గుర్తించలేవు. చేపల కన్ను స్థిరంగా ఉన్నా శరీరం నిరంతరం చలిస్తూ ఉంటుంది. కాబట్టి వస్తువును గుర్తించగలవు. కదలని శరీరం, కదలని కనుగ్రుడ్డు గల కప్ప కదిలే ఆహారాన్ని గుర్తించగలుగుతుంది. చనిపోయిన ఆహారం దాని ఎదురుగా ఉన్నా అది గుర్తించలేదు.

కప్పను ఇంట్లో పెంచాలంటే చలించే యంత్రంపై మాంసపు ముక్కలను ఉంచాలి. కప్ప పూర్తి మాంసాహారి.

మన కనుగ్రుడ్డు కూడా నిరంతరం చలిస్తూనే ఉంటుంది. కను గ్రుడ్డు చలించటం మానేస్తే మనం కూడా ఎదురుగా ఉన్న చలించని వస్తువులను, జీవులను గుర్తించలేం. ఇప్పుడు మీనాక్షి అనే పదానికి క్రొత్త అర్థం చెప్పుకోవచ్చు. చేప ఆకారపు కన్నులు కాదు, చేప శరీరంలా నిరంతరం చలించే కన్నులు గల స్త్రీ అని.

మీరు కుడి కన్ను కుడి వైపుకు, ఎడమ కన్ను ఎడమ వైపుకు విడివిడిగా ఒకే సారి త్రిప్పగలరా? ప్రయత్నించండి. అది అసాధ్యమని మీ అందరికీ తెలుసు. కాని ఇలా రెండు కళ్ళనూ పరస్పర

వ్యతిరేక దిశలో త్రిప్పగల జీవి ఉన్నది, అది ఊసరవెల్లి. రంగులు మార్చడంలోనే కాదు, కళ్ళలోనూ ప్రత్యేకత గల జీవి ఊసరవెల్లి. రెండు కళ్ళూ రెండు వైపులా ఆహారం కోసం వెదుకుతాయి.

ఆహారం కనబడగానే రెండు కళ్ళనూ ఆ వైపు త్రిప్పుతుంది. దీని వలన మూడు కొలతల ప్రతిబింబం ఏర్పడి, ఆహారం ఎంత దూరంలో ఉందో అంచనా వేస్తుంది. తన శరీరం కంటే పొడవైన, జిగురుగా ఉండే నాలుకను విసరి ఆహారాన్ని పట్టుకుంటుంది.

కళ్ళు ఎంత పరిమాణంలో ఉండాలి?

'ఇంతలు కన్నులుండ తెఱువెవ్వరి వేడెదు భూసురేంద్ర' అంటూ వరూధిని ప్రవరాఖ్యుణ్ణి కవ్విస్తుంది.

జీవితాన్ని బట్టి కన్నులు అన్నది ప్రకృతి సిద్ధాంతం.

జీవితాన్ని బట్టి అంటే - దివాచరాలు - అంటే పగలు సంచరించే జీవులకు ఎక్కువ వెలుతురు ఉంటుంది. కాబట్టి కన్ను చిన్నదిగా ఉన్నా, వెలుగు ఎక్కువ కాబట్టి ఎదుటి వస్తువు చూడగలుగుతాయి. అదే రాత్రించరాలకు వెలుగు తక్కువ. కాబట్టి ఎక్కువ వెలుతురు గ్రహించటానికి పెద్ద కళ్ళుండాలి. అందుకే గుడ్ల గూబకు అంత పెద్ద కళ్ళుంటాయి. పగలు లభించే వెలుతురులో వందోవంతు వెలుతురులో కూడా గుడ్ల గూబలు స్పష్టంగా చూడగలుగుతాయి. పూర్తి చీకట్లో నివసించే జీవులలో కళ్ళు బాగా క్షీణిస్తాయి, లేదా నశిస్తాయి. వాటిల్లో వాసన, ధ్వని ప్రధాన పాత్ర వహిస్తాయి.

రాత్రివేళ రోడ్లపై ప్రయాణించే వారు ఎదురుగా వస్తున్న ఆవుల మంద, గొఱ్ఱెల గుంపుపై వెలుతురు పడ్డప్పుడు వాటి కళ్ళు కొంత కాంతితో మెరవడం గమనించే ఉంటారు. దీనికి కారణం కంటిలో ఉండే టపీటమ్ 'Tapetum' అనే పొర. ఈ పొర కంటిలోకి ప్రవేశించిన కాంతిని రెటీనా పైకి ప్రసరించేట్లు చేస్తుంది. దీని వలన రాత్రి వేళ అతి తక్కువ కాంతి కూడా వస్తువు చూడటానికి సరిపోతుంది.

ఇంతసేపూ దృష్టిని గూర్చి ముచ్చటించుకున్నాం. ఓ అనుమానం మీకు వచ్చి ఉండాలి. మనకు ఓ వయసు దాటిన తర్వాత తప్పకుండా కళ్ళు మసక బారతాయి. ఇలా ఇతర జీవులలో కూడా జరుగుతుందా?

కళ్ళు సరిగా కనిపించకపోవడం అన్ని జంతువులలోనూ ఉంటుంది. కాని ప్రకృతి మానవుడి విషయంలో కొంత తక్కువ అంచనా వేసింది. లిపి - అంటే అక్షరాలు వ్రాయటం కనిపెట్టిన మానవుడు ఈ చదివే అద్దాలను స్వయంగా తెచ్చుకున్నాడు. ఒక్క చదవటం మినహాయిస్తే మిగిలిన పనులకు ఈ అద్దాల అవసరం అంతగా లేదు. బియ్యంలో రాళ్ళేరడం, బట్టలు కుట్టడం వంటివి కూడా మనం తయారు చేసుకున్నవే.

కళ్ళజోడు ఆధునికతకు చిహ్నం.

*("ఆకాశవాణి విజయవాడ కేంద్రం ఉదయ రేఖలు కార్యక్రమంలో సైన్సు వీధి శీర్షిక క్రింద ప్రసారం చేయబడింది".)*

# పెట్టుబడిదారీ వ్యవస్థ 'అంతర్లోకం' రావిశాస్త్రి 'కిరీటిరావు'

- జయంతి పాపారావు

శ్రీశ్రీ 1934లో ఓ కవిత రాసేడు. దాని పేరు 'ఋక్కులు'. తొమ్మిది ఋక్కులు చెప్పేడు. కాదేదీ కవిత కనర్హమన్నాడు. ఇదేంటి? మార్క్సిజపు తాత్త్వికతతో భావజాల విప్లవాలు సృష్టించే ప్రత్యామ్నాయ సాహిత్యానికి శ్రీశ్రీ బాట వేసాడు. ఆ దిశలో 'ఋక్కులను' తొలి వెలుగులుగా గుర్తించాల్సి వుంది. ప్రత్యామ్నాయ సాహిత్య విశ్వాసాన్ని, నిబద్ధతను, వాటిల్లో చూడగలం. 'రాజ్య సాహిత్యానికి ప్రత్యామ్నాయతను నిర్దేశించేడు.

'ఋక్కుల'ను రావి శాస్త్రి కథలుగా చెప్పేడు. భావజాల విప్లవాలు సృష్టించే ఉద్యమ సాహిత్య ప్రత్యామ్నాయాన్ని - విప్లవ సాహిత్య ప్రత్యామ్నాయాన్ని - రావి శాస్త్రి 'ఋక్కుల్లో' నిరూపించేడు. రాజకీయ ప్రత్యామ్నాయ విశ్వాసం బలపడుతూ వచ్చింది. ఆ కథలు 1962 - 1968కాలంలో 'యువ' మాసపత్రికలో వచ్చేయి. 'గుర్రపు కళ్లెం' అనేది 'ఆంధ్రజ్యోతి' వార పత్రికలో 1973లో వచ్చింది. ఇది నవలగా విస్తరించింది. 'గుర్రపు కళ్లెం అను మరిడి మహాలక్ష్మి కథ లేక 'గోవులొస్తున్నాయి జాగ్రత్త!' అను నవల 1973లో పుస్తకంగా వచ్చింది.

'పేద లెవ్వరూ ఇది చదువరాదు. చదివినచో వారు శిక్షలకు పాత్రులగుదురు' అను న్యాయ స్థానపు అధికారశైలిలో చెబుతూ కిరీటిరావు ఈ నవల్లో అడుగు పెడతాడు. ఉత్తమ పురుషలో నవల నడుస్తుంది.

ఈ నవల్లో 1920 - 30 కాలం నాటి సత్యాగ్రహ ఉద్యమపు నేపథ్యం వుంది. భావజాల పరంగా 1970ల నాటి శ్రీకాకుళ పోరాటాల్ని స్పృశిస్తోంది. 1920నుండి అర్థ శతాబ్దపు రాజకీయ సామాజిక పరిణామాల్ని ఆవిష్కరిస్తోంది. క్రూరమైన భూస్వామ్య వ్యవస్థ అంత కంటే క్రూరమైన పెట్టుబడి దారీ వ్యవస్థగా ఎలా పరిణామం చెందుతూ వస్తోందో ఈ నవల్లో చారిత్రక ఆధారాలతో రచయిత

వ్యవస్థను నడిపిస్తున్న పెట్టుబడిదారీ వర్గ భావజాలాన్నీ - పెట్టుబడిదారీ రాజకీయ వర్గ భావజాలాన్నీ - రచయిత కిరీటిరావులో పాత్రీకరించేడు. చిత్రీకరించేడు. చారిత్రీకరించేడు. ఇతి హాసీకరించేడు.

సన్న ఖద్దరు మరియు ముతక ఖద్దరు ఉద్యమ భావ జాలంలో నవల ప్రారంభమయ్యింది.

లచ్చయ్యమ్మ తన గోగణాల్నీ తన కొడుకునీ వెంటవేసుకుని వస్తుందనీ, గోసామ్రాజ్యం స్థాపించి పేదలందరికీ సుఖశాంతులు ప్రసాదిస్తుందనే శ్రీకాకుళ పోరాటపు రాజకీయ ప్రత్యామ్నాయ విశ్వాసాన్ని ప్రకటిస్తూ నవల ముగిస్తుంది.

---

జయంతీ పాపారావు, మురళీనగర్, విశాఖపట్నం - 7

రావిశాస్త్రి కథల్లో స్పష్టతవుంటుంది. నవలల్లో సంక్లిష్టత వుంటుంది. దానికి రెండు కారకాలను గుర్తించగలం. ఒకటోది ఏమిటంటే వ్యవస్థలోని సంఘర్షణాత్మక సంక్లిష్ట భావజాలాన్ని చారిత్రీకరిస్తున్నప్పుడు, నవల్లో సంక్లిష్టత చోటు చేసుకుంటుంది. రెండోది ఏమి టంటే - అతడి నవలలు ఏంటి?! ఆధునిక మహా భారతాలు - వర్గ పోరాట ఇతిహాసాలు- ప్రజాయుద్ధ ప్రబంధాలు! అంతే కాకుండా, ముఖ్యమైన మూడో కారణాన్ని కూడా గుర్తించగలం. సంఘటన సన్న ఖద్దరు మరియు ముతక ఖద్దరు ఉద్యమ కాలం నాటిది. కథనం శ్రీ కాకుళ పోరాటం సృష్టించిన భావజాలంలో నడుస్తుంది. సంక్లిష్టతను చిత్రీకరిస్తున్నప్పుడు, సంక్లిష్టత లేకుండా ఎలా వుంటుంది?!

సంఘటనలో రాజయోగి - లచ్చయ్యమ్మ - భూస్వామ్య వ్యవస్థ - ముఖ్య పాత్రలు. శ్యామ సుందర కిరీటి రావుది ప్రేక్షక పాత్ర. భూ స్వామ్య వ్యవస్థ మూలాల్లోంచి, మూల్యాంల్లోంచి, వచ్చిన క్రూరమైన పెట్టుబడి దారీ వ్యవస్థ సర్వ జగత్తునీ - అంతర్లోకాన్నీ - ప్రదర్శించిన గొప్ప దర్శకుడు కిరీటిరావు. కిరీటి రావులో పెట్టుబడిదారీ వర్గ అంతర్లోకాన్ని, విశ్వరూపాన్ని, చూడగలం.

కిరీటిరావు బెంగాల్లో సబ్‌డివిజన్ మేజిస్ట్రేట్‌గా ఉండేవాడు. ఉద్యమకారుల మీద కాల్పులు చేయించేవాడు. శిక్షపడి, ప్రమోషన్ కోల్పోయాడు. కోర్టుకు వెళ్ళిగెలిచి కొంత కాలం పని చేసాడు. తరవాత స్వచ్ఛంద పదవీ విరణ చేసి, వ్యాపారంలో ప్రవేశించేడు.

కిరీటి తన పద్నాల్గో ఏట 1930లో పెదనాయన రాజయోగి గారి ఆశ్రమానికి వెళ్లేడు. రాజయోగి సు. సుందరి పురం జమీన్ దారు. ఆయనకు ముగ్గురు భార్యలున్నా పిల్లలు లేరు. ఆయన కిరీటిని దత్తత చేసుకుంటాడని కిరీటి ఆశించేడు. కుటుంబంలోని అందరూ ఆశించేరు. అదలా జరగ లేదు. అది జరగకముందే గో గణ పోరాటంలో ఆయన మరణించాడు.

కిరీటి చిన్నతనంలో రాజయోగి గారి ఆశ్రమంలో జరిగిన సంఘటన చూసాడు. అది 1930లో జరిగింది. అది నవల ఇతి వృత్తం. అది అంతటితో పూర్తికాలేదు. ఆ సంఘటనకు సంబంధించిన కొంత వృత్తాంతం పెద్దయ్యాక కూడా తెలుసుకున్నాడు. ఆ మాట కిరీటే చెప్తాడు.

''ఆ తరువాత్తరువాత, నేను పెద్దయ్యేక, లచ్చయ్యమ్మ చరిత్రంతా నాకు పూర్తిగా తెలిసింది'' అంటాడు (పేజి : 276). అలాగే మరోచోట కూడ అంటాడు. ''చిన్నతనంలో నాకు సరిగ్గా తెలియక పోడంవల్ల, ఖద్దరు గాళ్లంతా ఒకటేనని నేననుకునేవాణ్ని'' అంటాడు (పేజి. 305). గోపోరాటం జరిగిన్నాడు ''లచ్చయ్యమ్మ నా వైపు చూసి ఆ వేశ పడిందేమో ననుకున్నాను. కాని, ఆవిడ నన్ను గమనించ లేదని ఆ తరవాత చాలా కాలానికి నాకు తెలిసింది'' అంటాడు (పేజి : 424).

ఏమిటంటే - కిరీటి చెప్పిందంతా తను చిన్నతనంలో చూసి మరియు విన్న వృత్తాంతానికే పరిమితమై పోలేదు. ఎంతో వృత్తాంతాన్నీ, ఎన్నో వివరాలనూ, సేకరిస్తూ వస్తున్నాడు. అదంతా అవన్నీ విశ్లేషిస్తూ, వ్యాఖ్యానిస్తూ, నవలా కథనాన్ని నడుపుతాడు.

కిరీటి 1930ల నాటి సంఘటనను ఎప్పుడు చెప్పేడు? ఎందుకు చెప్పేడు? చూద్దాం.

కిరీటి స్వచ్ఛంద పదవీ విరమణ చేసి వ్యాపారంలో చాలా బాగా స్థిర పడ్డాడు. అతడి కొడుకు ఐ. పి. ఎస్. పాసయి ఉన్నత ఉద్యోగంలో స్థిర పడ్డాడు. ఒక కూతురుంది. ఆమెకు పెళ్లి చేసేడు. అల్లుడు ఇంజినీరుగు పని చేస్తున్నాడు. ఆ తరవాత కాలంలో చిన్ననాటి సంఘటనను, వృత్తాంతాన్ని, పెట్టుబడిదారీ వర్గ భావజాల స్రవంతిలో చెప్పేడని స్పష్టమౌతుంది. అంటే కిరీటి 1970ల ప్రాంతంలో చెప్పేడు. అంటే శ్రీ కాకుళ పోరాట కాలంలో చెప్పేడు. రచయిత ఈ నవలను కూడా అప్పుడే రాసేడు. శ్రీ కాకుళ పోరాటం సృష్టించిన భావజాలంతో ఈ నవలకు సంబంధం వుందనీ, ఆ భావజాలంలోంచే వచ్చిందని స్పష్టమౌతోంది. రావిశాస్త్రితో పరిచయమున్న ఆనాటి రచయితలకు యీ వాస్తవం తెలుసు. అయితే సాహిత్యంలోంచి సాహిత్య పరంగా చెప్పుకునే ప్రయత్నం ఇక్కడ చేసాం.

''ప్రస్తుత పరిస్థితులు చూస్తుంటే నాకు ఆందోళన కలుగుతుంది. ఇటువంటి సమయంలో మంచి చెడ్డల గురించి పెద్దవారికి అసలైన తెలివి తేటలుండడం చాలా అవసరమని నానమ్మకం. నా చిన్న నాటి సంఘటనను పెద్దలందరికీ, ( అందులో ముఖ్యంగా పాలకులకీ) చెప్తే మంచిదనీ, చెప్పడం చాలా అవసరమని నాకు తోచింది'' అని కిరీటి రావు ఆ సంఘటనను చెప్తాడు. పెట్టుబడి దారీ వర్గంలో పెట్టుబడిదారీ రాజకీయ వర్గంలో - శ్రీకాకుళ పోరాటం కలిగించిన ఆందోళనను, కదిలించిన భావ జాలాన్నీ, రావిశాస్త్రి కిరీటిరావుగా పాత్రీకరించి. కిరీటిరావుచే చెప్పించేవాడు.

ఎందుకంటే - ఇదంతా ఎందుకు చెప్పుకున్నామంటే - ఎందరో ఎన్నో ప్రశ్నాస్త్రాలను ఈ నవల మీద సంధించారు.

1. చిన్న నాటి సంఘటనను అంత వివరంగా అంతలోతుగా అంత చిన్న వయసులో ఎలా గుర్తించేడు? ఎలా గుర్తు పెట్టుకో గలిగేడు ?
2. ఆ సంఘటన అంత ఆలస్యంగా ఎన్నో దశాబ్దాల తరవాత ఎందుకు చెప్పేడు? అంతకు ముందే ఎప్పుడో ఎందుకు చెప్ప లేదు?
3. కిరీటిరావు వాదన, భావజాలం, అదుపు దాటి పెట్టుబడి దారీ వర్గపు దోపిడీని పరపీడనమూ సమర్థిస్తూ, నమ్మించేదిగా వుంది కదా?! అది పీడితవర్గానికి హాని కరం కాదా ?!
4. గోవులు సాధుజంతువులు ? అవి తిరుగబడతాయా?

ఇటువంటి ఎన్నో ప్రశ్నలను కురిపించేరు. దీనికి ముఖ్యంగా రెండు కారణాలను చెప్పుకోవాల్సి వుంది.

కిరీటిరావు చిన్న నాటి సంఘటనకు సంబంధించిన వివరాలు సేకరిస్తూ, నాలుగు దశాబ్దాల తరవాత చెప్పేడు. అది గుర్తించినట్లు లేదు. ఈ నవలకు శ్రీకాకుళ పోరాటం సృష్టించిన భావ జాలంతో సంబంధంవుంది. అది కూడా గుర్తించినట్లు లేదు. సుబ్బారావు పాణిగ్రాహి - ఆదిభట్లకైలాసం -

వెంపటాపు సత్యం - గిరిజనులు - ఎవరు?! గంగిగోవులు కారా?! ఎందుకు తిరుగబడ్డారు?! అది కూడా గుర్తించినట్లు లేదు.

శత్రువు భావజాలం - బలా బలాలు - అంతర్లోకం - సర్వజగత్తూ - వంటివి తెలుసుకోవడం ప్రజాతిరుగుబాటు ఉద్యమాలకు అవసరమే కాకుండా, అనివార్యమైంది. అది భావజాల ఉద్యమాలకు పని కొస్తుంది. ఉద్యమ వ్యూహరచనకు ఉపయోగపడుతుంది. వర్గపోరాట చైతన్యానికి సహకరిస్తుంది. ఇది కూడా గుర్తించినట్లు లేదు!

కిరీటి ఏం చేసాడు? పెట్టుబడిదారీ వర్గ ప్రయోజనాలు కాపాడ్డం కోసం - అధోజగత్తు సర్వ జగత్తునీ కూడా పెట్టుబడిదారీ వర్గం ముందు వుంచలేదా?! ఎందుకలా చేసాడు?! ఈ వృత్తాంతమంతా ఎందుకు చెప్పాల్సి వచ్చిందో కిరీటే స్పష్టీకరించేడు! అది ముందే చెప్పుకున్నాం.

రెండో కారణం కూడా చెప్పుకుందాం. అలా కాకపోతే, వాస్తవాలను దాచడమే అవుతుంది. అది చరిత్రకు మంచిది కాదు. ఆనాటి రాజ్య సాహిత్య కారుల విప్లవ సాహిత్య కారులనూ, విప్లవ సామిత్యాన్నీ, నిందిస్తూ దూషిస్తూ విరుచుకు పడుతూ వుండేవారు. ప్రజలను తప్పు దారి పట్టిస్తూ వుండేవారు. వారు అలా చేసి చేసి అలసి పోయి, విరామంలోకి వెళ్లిపోయాక, స్త్రీవాద దళిత వాద రాజ్య సాహిత్యకారులు ఆపనిని కొనసాగించేరు.

పెట్టుబడిదారీ రాజ్య వ్యవస్థకూ, పెట్టుబడి దారీ దోపిడీ శక్తులకు సహకరించేశక్తులే ఆ వాదాలనీ, వీటి స్వరూప స్వభావాలూ (ఎన్.జి.వో.ల) స్వచ్ఛంద సంస్థల స్వరూప స్వభావాలకూ తేడా ఏమీ లేదని, రెండూ ఒకటే అనీ, రెండూ దోపిడీ శక్తులకు సహకరించేవే అనీ ప్రజలూ, ప్రజా ఉద్యమాలూ, గుర్తించాక వీరందరూ అదృశ్యమై పోయారు. చేయ గలిగిందేమీ లేక నిందిస్తూ జీవితాన్ని గడుపుతున్నారు. నిర్మాణశీల ప్రజా ఉద్యమాలు నిర్మించ లేనివారు, అటువంటి ప్రజా ఉద్యమాలకు సహకరించే నిర్మాణశీల సాహిత్యం రచించలేని రాజ్య సాహిత్యకారులు నిందించడం మాత్రమే చేయగలరు? అదే చేస్తున్నారు!

ఎన్నో జీవన సత్యాలు - ఎన్నెన్నో చారిత్రక సత్యాలు - మరెంతో జీవన సారాంశం - ఈ నవల నిండా రాజయోగి మరియు కిరీటిరావులు వినిపిస్తారు. అవి చెప్పడమంటే నవలని కాపీ చేయడమే అవుతుంది.

ప్రపంచ రాజకీయ వ్యవస్థల్లో ఎంతో కొంత ప్రజాస్వామికత, ప్రజా స్వామిక విలువలూ వున్నాయంటే, రాజకీయ ప్రత్యామ్నాయ విశ్వాసంలోంచి వచ్చిన ప్రజాపోరాటాల వల్లే అది జరిగిందనీ, అవి మరింకా అభివృద్ధి చెందాలంటే, ప్రజాపోరాటాలు అనివార్యమనీ, ఆ చారిత్రక సత్యాన్ని నిర్మాణ శీల దృక్పథంతో గుర్తించినప్పుడే విప్లవోద్యమాలనూ, విప్లవ సాహిత్యాన్ని సరిగ్గా అర్థం చేసుకోగలం!

స్వార్థాలతో త్యాగాలను నిందించడంకంటే నీచమైనదేదీ ప్రపంచంలో వుండదు!

# కళావాదాలు అన్నీ ప్రగతి శీలమైనవి కావు

- విరియాల లక్ష్మీపతి

20వ శతాబ్దంలో అనేక తాత్విక వాదాలు ఉద్భవించాయి. మార్క్స్ నుండి నీషే వరకూ అనేక మంది ప్రవక్తలు అనేక వాదాలు నిర్వచించారు. అయితే ఆ వాదాలు అన్నింటిలోనూ బహుజనులకు సుఖదాయకమైన వాదాలు ఎన్నో లేవు. డైలెక్టికల్ మెటీరియలిజంని మొట్టమొదట నిర్వచించిన హెగెల్ ఆదర్శభావజాలానికి దోహదం చేశాడు. కాని అతని శిష్యుడు కారల్ మార్క్స్ డైలెక్టికల్ హిస్టారికల్ మెటీరియలిజంగా రూపొందించాడు. అది పీడిత ప్రజల ఆయుధమని నిర్వచించాడు. ఈ రకంగానే ఎన్నో తాత్విక ధోరణులు ప్రపంచాన్ని అతలాకుతలం చేశాయి. అందులోంచి అనేకానేక సాహిత్య వాదాలు ఆ ంచాయి.

జర్మనీలో జన్మించిన లుడ్విగ్ కరసనర్ అనే మేధావి కళలో ఎక్స్‌ప్రెషనిజం అనేవాదాన్ని రూపొందించాడు. దీని ద్వారా వస్తువులు బాహ్య స్వరూపాల్ని వాటి మసురణత్వాన్ని నైర్మల్యాన్నే కాకవాటి ఆంతరంగికసత్యాల్ని కూడా వెలికి తీసుకు రావాలన్నది ప్రధానాంశంగా అతడు బోధించాడు.

ఇది నిజానికి వాస్తవిక ప్రపంచానికి భిన్నంగా భ్రమా స్పదంగా ఆదర్శవాదాన్నే అతని చిత్రకళ నెలకొల్పింది. అయితే అది ఒక అభినవశైలి కనుక కీర్తి రాలేదు. అచిరకాలంలోనే మరుగున పడిపోయింది. అయితే దీని ఛాయలు నాటకంలోనూ కవిత్వంలోనూ ప్రపంచ వ్యాప్తంగా చోటు చేసుకున్నాయి. ఎర్నెస్టు టోలర్ లాంటి కమ్యూనిస్టు కవి ( మంది- మనిషి) 'Mass and Man' లాంటి నాటకాలు 'Sparrow in the Prison' వంటి కవితలు ఇదే సూత్రంతో రచించారు. అతను పీడిత జన పక్షపాతి కనుక తాను స్వీకరించిన కళా వాదం ద్వారా దుష్ఫలితాలు తన రచనలలో చోటు కేసుకోకుండా జాగ్రత్తవహించి అభ్యుదయ సాహిత్యాన్ని సృష్టించాడు. తన తర్వాత వచ్చిన ప్రగతి శీలురకు ఆదర్శప్రాయుడు అయ్యాడు. ఈ వాదం ఆధారంగానే పరిణామం పొందిన తత్వశాస్త్రాన్ని బెర్గసన్ రూపొందించాడు.

సాహిత్యంలో ఇదే వాదన భూమికతో డాస్టో విస్కీ ప్రజల కష్ట సుఖాలను ప్రతిబింబించేలా రచనలు చేసి ప్రపంచ ఖ్యాతిని ఆర్జించాడు.

ఉత్తమ ఆలోచన్లు రేకెత్తించిన కాఫ్కా వంటి రచయితలు ఆలోచనా స్రవంతిని అస్తిత్వవాదంతో మిశ్రమం చేసి రచనలు సాగించారు.

కెసిల్ వంటి రచయితలు ప్రజలకు ప్రబోధాత్మక రచనలు చేయక పోగా సాహిత్యానందం కూడా సమకూర్చ లేక పోయారు.

---

విరియాల లక్ష్మీపతి, విశాఖపట్నం, ప్రముఖ పద్యనాటక రచయిత

ఐకాంతిక అనుభవ ప్రకర్షవల్ల అతని రచనలు మార్మికమై గుహ్యమై ప్రజాబాహుళ్యానికి ఎందుకూ కొరగాని వయ్యాయి.

ఈ అభివ్యక్తి వాదం (ఎక్స్ ప్రెషనిజం) తొలుత చిత్రకళని ఆ తర్వాత సాహిత్యాలని ఆ తర్వాత తత్వ శాస్త్రాలని ప్రభావితం చేసి సంగీతంలో వినూత్న ప్రయోగాలకు ప్రేరణ కల్గించింది.

సింఫనీలను జామెట్రికల్ హైపోథటెక్ స్వరూపాలుగా మార్చి మొట్టమొదట వినిపించిన సంగీత వేత్త లోస్టన్ టీన్. అయితే అతని తర్వాత అతని వాదన మాత్రం నిస్సంతుగానే మిగిలిపోయింది. ఆ తర్వాత ఉద్భవించింది ఫ్యూచరిజం. ఈ వాదన ప్రఖ్యాత రష్యన్ కవి మయకోవిస్కీని అపారంగా ప్రభావితం చేసింది మయకోవిస్కీ తర్వాత ఈ వాదాన్ని అనుసరించిన కవుల జాడలు లేవు.

1881లో స్పెయిన్ లో జన్మించిన 1973లో కాలం చేసిన బాధితుల పక్షం వహించిన పాబ్లో - పికాసో క్యూబిస్టు చిత్రకారుడుగా ప్రపంచ ఖ్యాతి నార్జించాడు.

సర్రియలిస్టు చిత్రకారుడైన డాలీని ఇతను ఎంతగానో ప్రోత్సహించాడు. 1937లో ముస్సోలినీ ఫాసిస్టు సైనికులు ''గుయర్నికా'' నగరాన్ని సమూలంగా విధ్వంసం చేసినపుడు పాబ్లో పికాసో అత్యంత సువిశాలమైన కాన్వాసులో ''గుయర్నికా'' చిత్రాన్ని చిత్రీకరించాడు.

అసంఖ్యాక క్యూబిస్టు సింబల్స్ లోగల ఈ చిత్రం అత్యంత ఆకర్షణీయం అయినది. ఏళ్ళతరబడి ప్రేక్షకుడు పరిశీలించి శోధించినా ఇంకా ఎంతో మిగిలి వుండే రామణీయకత కలిగిన చిత్రం. ఒక మహా భయకంర దృశ్యం సింబల్స్ ద్వారా చూపరుల మనో తలం మీద ముద్రిస్తుంది. ఇది సులభంగా వ్యాఖ్యానానికి అందకపోయినా భయానకమైన సింబల్స్ మాత్రం భీభత్స వాతావరణాన్ని ప్రేక్షక మనోతలం మీద ఆవరిస్తాయి.

గుయర్నికా చిత్రాన్ని సృష్టించినందుకూ ప్రదర్శించినందుకూ పికాసోని సజీవదహనం చేయడానికి తీవ్రంగా ప్రయత్నిం చేయి, ముస్సోలినీ ఫాసిస్టు మూకలు. అదే తరుణంలో పికాసో పేరిస్ నగరంలో తలదాచుకొని శాంతి యోధుడై యుద్ధోన్మాదానికి వ్యతిరేకంగా తీవ్ర కృషిచేశాడు.

ఇతని చిత్రాలు అన్నీ సహృదయ ప్రేక్షకులలో అనంతమైన ఆలోచన్లు రేకెత్తించాయన్నది చారిత్రక సత్యం. యథాతథాంగా వివరించి వ్యాఖ్యానించడానికి అస్మదాదులకు త్రాణ లేక పోయినా పెన్‌రోస్ వంటి చిత్రకళా వ్యాఖ్యాతలు ఎందరో పికాసో చిత్ర కళ గురించి విజ్ఞానాత్మక గ్రంథాలు రచించారు.

పికాసో చిత్రకారుడే కాక నాటక రచయిత ప్రయోక్త, వ్యాస రచయిత, ఈ ప్రతీకవాదం ప్రపంచ కళాకారులందరినీ వారివారి సంవిధానాలలో వినూత్న సృజనచేయడానికి ఎంతగానో దోహదం చేసింది. ఇంక కవులు రచయితల సంగతి చెప్పనక్కరలేదు.

ఇం[ప్రెషనిజం జర్మనీలో దాదాపు ఎడ్ మార్డ్ మానేతో అంతరించి పోయినా 1839లో జన్మించి 1906లో మరణించిన పాల్ సెజన్ పోస్టు ఇం[ప్రెషనిజం కళావాదాన్ని సృష్టించి సృజనకు శ్రీకారం చుట్టాడు.

ఈవాదం ఇం[ప్రెషనిజం చిత్రకళ పొందిన వైఫల్యాన్ని దృష్టిలో వుంచుకొని చేసిన సంస్కరణ మాత్రమే కాని నూతన సృష్టిగా చెలామణీ కాలేదు.

1922లో జార్ తన అనుచరులతో కలసి డాడాయింజని రూపొందించాడు. అది తత్పూర్వ సంవిధానాలన్నింటినీ కూకటి వేళ్లతో పెకలించి నాశనం చేయాలనే విధ్వంస వాదం.

ఈ వాదనకు వ్యతిరేకంగా ఫ్రెంచి కవులు, రచయితలు కొంత నిరసన వ్యక్తం చేశారు. దీని ప్రభావం తోనే సాడా అనే నవలా రచయిత భయంకరమైన హింసాత్మకమైన బూతు కథలు వ్రాసి ''సేడిజం'' కి అధ్యుడయ్యాడు.

ఫ్రాయిడ్ స్వప్న విశ్లేషణ ఫలితంగా సర్రియలిజంకి మాత్రం అటు చిత్ర కళలోనూ ఇటు సాహిత్య రంగంలోనూ అపారమైన ఆదరణ లభించింది.

ప్రపంచ వ్యాప్తంగా విపరీతమైన సాహిత్య సృష్టి కళాసృష్టి జరిగింది. ఫ్రాన్స్ కవులు గిలానీ ఎపోలనాయడ్ ఈ విధానంలో ఎన్నో కవితలు వ్రాశారు.

జేమ్స్ జాయిస్, వర్జీనియా ఉల్ఫ్ వంటివారు రూపొందించిన చైతన్య స్రవంతి అనే ప్రక్రియ ప్రపంచ వ్యాప్తంగా సాహిత్యంలో నూతన సృష్టికి భూమిక అయింది.

రచయిత తన మనస్సులోని ఇంద్రియ శక్తిని స్వేచ్ఛగా విడిచి సంగతా సంగతి విచక్షణ లేకుండా వ్రాసుకుంటూ పోయే పద్ధతే చైతన్య స్రవంతి.

మనస్సు లాగే రచన కూడా అనేకానేక అంశాలను స్పృశించుకుంటూ గాలిలో ఎగిరే తూనీగ మాదిరిగ ఉంటుందని, సంప్రదాయ భవ బంధాలనుండి సృజనాత్మకతను స్వేచ్ఛగా వదలాలని ఈ ప్రయోగ వాదం ఎంతో మంది ప్రయోగ వాదుల్ని ప్రభావితం చేసింది. ఈ నేపధ్యంతోనే ఎన్నో నవలలు, ఎన్నో కథలు, ఎన్నో కవితలు ఉద్భవించాయి.

అయితే కవిత్వ పరంగా మాత్రం ఎక్కువ ప్రయోగం జరగలేదు. ప్రపంచ వ్యాప్తంగా కవిత్వాంకుర అంతంత మాత్రమే అయింది.

ఇజ్రాఫౌండ్ అమియా వంటి వారు రూపొందించిన ఇమేజిజం కూడా సాహిత్యంలో ముఖ్యంగా కవిత్వంలో కొంత స్థిరత్వం రూపుదిద్దుకుంది.

ప్రపంచం సాహిత్యం మరొక కొత్త మలుపు తీసుకొంది.

ఆధునికకాలంలో ముఖ్యంగా 1930లో గోర్కీ మహనీయుడు సోషలిస్టు రియలిజం అనే ప్రక్రియ నిర్వచించాడు. అక్కడతో అంతకు పూర్వంగల నేచురలిజం స్వతః సిద్ధ వాదం ఖండించబడింది.

సామాజిక వాస్తవికాతావాదానికి సామ్యవాదన రూపకల్పనకు పాఠక హృదయాన్ని ఆయత్తం చేసే భావ విప్లవాన్ని సాధించే నూతన శక్తి లభించింది.

ఈ సామాజిక వాస్తవికతా సంవిధానంలోనే అంతవరకూ పరస్పర ఖండన మండనలతో పెంపొందిన సర్వకళా వాదాలూ సంలీన మయ్యాయి.

సంవిధాన చాతుర్యాన్ని సార్వత్రికంగా రచనలకు చేకూర్చాలి అంటే అన్ని వాదాలూ కూడా సమాజ పరిధిలోంచే ఆవిష్కరించబడాలి.

మానవ హృదయానికి రసానందం కలిగించాలి. అలా రసానందం కలిగించని ఏ వాదమూ కూడా ఎందుకూ పనికి రానిదే అవుతుంది. సందేశం హితంగా అందించడమే ముఖ్యం అన్న ప్రధాన సూత్రాలు థామస్ మెన్, సింక్లయిర్, లూయీ సింక్లయిర్, మార్క్‌ట్వెయిన్, రస్సెల్ వంటి ప్రపంచ ప్రఖ్యాత రచయితలు, మేధావులు తాత్వికులు, తమ తమ ఆమోదాన్ని వ్యక్తం చేశారు.

అక్కడితో ప్రపంచం సాహిత్యం తీరు తెన్నుల్లో ఒక నూతన శక్తి ఆవిర్భవించింది.

20వ శతాబ్దం ముగిసిన నేటి పరిస్థితుల్లో ఏ కళా వాదమూ కేవలం కళావాద ప్రయోగం కోసమే కాదని, ప్రజా హృదయం ఆవిష్కరించడానికి ఉపయోగపడే సంవిధానం మాత్రమే స్వీకార యోగ్య మని ఒక విశ్వ జనీన నిర్ణయం. దీనిని సర్వ దేశ ఆధునిక అభ్యుదయ రచయితలు ఆరంభించారు.

భారత దేశంలో మున్షి ప్రేమ్‌చంద్, శరత్ చంద్ర చటర్జీ, రవీంద్ర నాథ్ఠాకూర్, సుబ్రమణ్యా భారతి, గురజాడ వంటి యావత్ భారత దేశ రచయితలు నూతన సాహిత్య ప్రక్రియల్లో ఇదే తాత్వికాంశాన్ని నెలకొల్పుతూ రచనలు చేశారు.

అంచేత మళ్లీ మనం ప్రపంచ యుద్ధానంతరం భీతావాహక పరిస్థితుల్లో జన్మించిన వికృత వాదాలు తిరిగి తలకెత్తుకొని ప్రయోగం కోసమే ప్రయోగంగానూ కళకోసమే కళగానూ సంక్షోభిత పరిస్థితిని సాహిత్యాన్ని సాహిత్య ప్రక్రియను దిగజార్చడం క్షీణ సారస్వత లక్షణం కాగలదు. మానవ హృదయ స్పర్శ లేని ఏ ప్రయోగవాదం కూడా స్వీకారయోగ్యం కాదని దానికి భవిష్యత్తు లేదని నిర్వచించడం చరిత్ర చెపుతున్న సత్యం.